శ్రీ

# గిరిజాకల్యాణ నాటకము.

నాలుగంకములు

తెలుఁగు నాటకము.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండిన

కీ. శే. కోలాచలం శ్రీనివాసరావు చే

రచియింపఁబడినది.

కె. శత్రుఘ్న రావు చేఁ

ప్రకటింపఁబడెను.

మొదటికూర్పు.





బళ్ళారి.

1924

~~వెల రు. 1-0-0~~

## రహస్యార్థము. (*Secret meaning.*)

1. YEESWARA:—Personification of all knowledge, Bliss anb Love i. e., Universal Soul pervading the universe and knowing itself.

1. ఈశ్వర:—విజ్ఞానందమయామూర్తి మూడులోకములు వ్యాపించి సకలమునూ తానని రక్షించుచు సంతసించుచున్నాడు.

2. NANDI:—Symbal of greatness or mahima of Siva as personification of Bliss.

2. నంది:— ఆనందమూర్తి. ఈశ్వరమహిమ.

3. YEESWARA } Known as Purushottama.
NANDI. }

3. ఈశ్వర - నంది:—పురుషోత్తమరూపము. శైవము - దైవమహిమ.

4. YEESWARA AS }
BHUTAPPATI:-- } Ruler of disembodied spirits.

4. ఈశ్వర. భూతపతి:—ముక్తులలో శ్రేష్ఠుడు.

5. YEESWARA AS }
DIGAMBARA OR NAKED } Personified divinity of truth or satiam.

5. ఈశ్వర. దిగంబర:—సత్యాకారము. ఏవిధమైన కళంకములేని దైవము.

6. YEESWARA AS LINGAM }
OR PHALLUS:— } Personification of "Vigor" of Yeeswara. This is neither masculine nor femanine nor nauter or no prefixes to the grader.

6. ఈశ్వర:—లింగమూర్తి. శైవబలము. (Sign of Vigor. Supreme self) స్వరూప (పుల్లింగ స్త్రీలింగ నపుంసకలింగములచే నిర్ధరింపబడని యాకారము.)

7. YEESWARA: —He is personification of "Patience and mercy"

7. ఈశ్వర:—దయాగుణమున శాంతమూర్తి. తపోగుణమున నుగ్రుడు.

8. YEESWARA:—He is terrible in doing "Penance or Tapus".

8. ఈశ్వర:—అహంకారమూర్తి. తపమునిచ్చలుంచి ప్రారంభమున నహంకారము దెంచెను.

9. YEESWARA:—Destroyer of "Desires or Kama". which disturb ascetics.

9. ఈశ్వర:—తపమును సేయునప్పుడు కామమునదహించెను.

10. YEESWARA:—Destroyer of "Pride or Ahankara" which is represented by "Duksha"

10. ఈశ్వర:—ఈశ్వరుని అహంకారమూర్తి దక్షుండు. హంకారము దెంచెను.

11. DAKSHAYANI:—"Illusion or Maya" which separated itself when Yeeswara intended penance. This Maya was a sacrifice in Daksha's sacrificial fire and becomes "Knowledge or Sutvidia" in the form of Parwati.

దాక్షాయణి. మాయ:—ఈశ్వరుడు తపముసేయనిచ్ఛయించి మాయాసంయోగము వదలెను. దాక్షాయణి సవనాగ్ని లో ప్రవేశించి జ్ఞానవిద్యాకారముగొని పార్వతియయి విజ్ఞానంద దయామూర్తిని చేరెను.

12. PARVATI OR UMA:—Personification "Vak or knowledge or Vidia. A spiritual being weaving words. This power was obtained by becoming a sacrifice in sacrificial fire.

12. పార్వతి. ఉమా:—జ్ఞానమూర్తిని. ఈశ్వరునిచే వాక్కులను చేయుశక్తి. ఆ శక్తి సవనమందు దహింపఁబడుటచే కలిగెను.

13. MANMATHA:—(Cupid) By mercy of Yeeswara he disentangled himself from his material body and assumed spiritual form and was known as Ananga and enjoyed divine Bliss.

13. మన్మథుఁడు:—ఈశ్వరానుగ్రహమున పాంచభౌతికమైన యంగమును వదలి యనంగుఁడయి ముక్తులలోఁ జేరఁ దలిఁచెఁగాని దైవిక సుఖానుభవమున నుండెను.

14. RATI:—(Venus) Enjoyment. By mercy of Yeeswara she became a personified object of spiritual enjoyment.

14. { రతి:—సుఖానుభవము.
Spiritual Enjoyment.

15. TARAKASURA:—Personification of evil. He was destroyed by Yeeswara's from as Kumara.

15. తారకాసురుఁడు:—ప్రాపంచిక నిష్టములఁ దొలఁగించడము.

16. DAKSHA AND DAKSHA'S SACRIFICE:— This sacrifice is known as "Aniswara" i. e., a sacrifice without any divine object and created by pride.

16. దక్షునియజ్ఞము:—అనీశ్వరమని పేరు. దైవమును భావింపనియజ్ఞము. అహంకృతి ఫలము.

17. DAKSHA:—Daksha becoming goatfaced or Aja Mukha is that by his repentance Yeeswara made him univarsal or "Aja".

17. దక్షుడు:—శిరస్సుఖండింపఁబడి యజాముఖుండాయెను. అహంకారము వదలి [illegible]నములచే ( అజాముఖుఁడు ) శరీరమునందెను.

18. GIRIJA'S MARRIAGE:-Vidia or knowledge unifying it or if with spiritual soul.

18 గిరిజాకల్యాణము:— పరమాత్మయొక్కఁడు నాత్మయొకటియై భవించి జ్ఞానానందభావమగుట.

REMARKS:—All the above meanings are supported by authorities. Besides this mysterious astronomical meaning is attached to this mythology. This I think is not the place for its narration,

ఇంకనొక జ్యోతిష సంబంధమైన యర్థమున్నది. అనవశ్యకమని యిందు వ్రాయఁబడలేదు. పైనవ్రాయఁబడిన యర్థము వేదోపనిషత్తుల వాక్యములచే బలపడి యున్నది.

కె. శ్రీనివాసరావు.

## పురుష పాత్రలు.

1 కశ్యపుఁడు
2 తారకాసురుఁడు
3 ఈశ్వరుఁడు
4 ఇంద్రుఁడు
5 అగ్ని
6 యముఁడు
7 నైరృతి
8 వరుణ
9 వాయవ్య
10 కుబేర
11 ఈశాన
12 దక్షుఁడు
13 బ్రహ్మ
14 హరి
15 బృహస్పతి
16 దధీచి
17 నంది
18 నారదుఁడు
19 వీరభద్రుఁడు
20 మన్మథుఁడు
21 పరమేశ్వరుఁడు
22 వృద్ధబ్రాహ్మణుఁడు

## స్త్రీ పాత్రలు.

1 మాయాదేవి
2 దాక్షాయణి
3 రతి
4 మేనక
5 పార్వతి
6 జయ
7 విజయ
8 చెలికత్తెలు

# శ్రీనివాససుకవి జీవిత చరిత్ర.

ఎవ్వానివదన రాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలుసలుపుచుండునో! ఎవ్వాఁడు కువ్యాఖ్యావిషమూర్ఛితయగు కాళిదాస కవితాసుకన్యకను దనదు సంజీవినిచేఁ దెప్పిఱిల్లఁజేసి, వెజ్జులమిన్నయని వన్నెకెక్కెనో! ఏమహామహు దివ్యసూమామృతిసును పీనులారఁగ్రోలని యితరాస్యుఁడొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వద్వతంసుఁడు అనన్య జనసామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శియయ్యెనో! అట్టిచుళుకీకృత సకలశాస్త్రజలధియగు కోలచల శ్రీమల్లినాథసూరి వంశమున మన శ్రీనివాస కవిముక్తామణి విరూపాక్షక్షేత్రమునకు సమీపముననుండు కామలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకం 185[illegible]-3-13 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁడుద్భవించె. బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప ఇతఁడు నాంగ్లేయ భాషయందసమానవైదుష్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగిగనుండి, తర్వాత న్యాయవాదిపరీక్షలయందు తీర్ణుఁడై, బలారి పురవరమున న్యాయవాదిగ వఱలుచుండె. ఇతనికి నొకకూఁతురును నలుగురు కుమారులును గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7-వ తేది దేవాళీపురమున జరిగిన విద్వత్సభయుని ప్రసిద్ధిఁగాంచి యాంధ్రసాహిత్యపరిషత్సభకగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్లుండ నేతత్కవిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్రకువలయంబు వసివాడఁగ కవిచక్రంబు ఉల్లసిల్ల 1919 సం॥రం జూన్ 28-వ తేది యస్తమించె.

ఇట్లు విన్నవించు సుధీజనవిధేయుఁడు,

రావాడి వెంకటరామశాస్త్రి,

శ్రీ

# గిరిజాకల్యాణ నాటకము.

నాంది.

సూత్రధారుఁడు.

శా॥ శ్రీరాజద్గిరిరాజ ప్రాకృత తపశ్శ్రీరాశిలోఁ బుట్టి, ని
ర్వ్యామాఢస్థిరయోగ మార్గమున సర్వారాధ్యుఁ జేపట్టి, క్రూ
రారివ్రాతనిహంతయౌ సుతుని సౌఖ్యారంభునిం గాంచి నా
నారీ భూషణమట్టి గౌరి యిడు నానాసౌఖ్యముల్మాకిలన్.

సుబంధము 1.

ప్రథమాంకము - ప్రథమరంగము.

కశ్యపుఁడు. మాయాదేవి.

( కశ్యపుఁడు తపంబొనరించుచు సమాధినిష్ఠఁ గూర్చుండియుండును.)

మాయ:--సీ॥ నియతిని శుక్రుసన్నిధిని నానేర్చిన
మాయలన్నియు మటుమాయలయ్యె
నిశ్చలతపమున నిర్నిద్రుఁడగుముని
చలచిత్తుఁ జేటులయి చెలిమిఁ జెంచు
గారాబునాతండ్రి గఱపినవిద్యలు
బూడిదెహోమమై పొలుపుచెఱను
భాసిలు రూపలావణ్యము లెల్లను
రోగికి సౌషధరూపుఁబ్లానై

నాటకమేనియుంగలదా? ఈ జవ్వని యువ్వనియందెవ్వనిపై వలచియుండునో? ఈ సుందర దన సారసవదన నాచేరువనుండి చంపకతరు మూలంబునందాఁగనేల?

కం॥ మలయానిలచలనంబుల
వలకలుచలియింపఁ బట్టె యలికులములు, బె
ల్వలపునను వియుచురాఁగను
చెవి బిగ్గిలి చంపకంబుఁ జేరెనయారే.

ఈ కలికి కన్యగా కనబడదు? పల్కరించిన నేమగునో? ఏకాంతంబున నుండఁ గూర్చుండియున్న మానినీమణిని పల్కరింపఁ జెల్లునే? పల్కరింపకున్నఁ మనోరథం బీడేరు టెట్లు? ఆ సుందరికన్యకామణితో మాటాడ మనంబేల కలిగెడును? పల్కరించి చూచెదం గాక (ప్రకాశముగా) ఓ చంచరీకాలకజాలక! ఓ చంద్రార్ధనిటల! ఓ చారుచమూరు లోచన! ఓ చంపక కుసుమనాసా! ఓ చంద్రికానమహాస! నీవెవ్వరిదానవు? ఈ చంపక తరుమూలమునం దేలదాఁగితివి?

మాయ:--(అగపడి నిలుచుండును.)

కళ్య:—సీ॥ అయ్యారె! యొయ్యారి! యెయ్యదినీ నామ,
మెయ్యదినీ పురి యెద్దికులము

మాయ:— యతివరా! యసురేంద్రసుతను నేసురసను,
మాయ యందురునన్ను మహినిజనులు

కళ్య:— జవ్వని, యువ్వని, నెవ్వనిపై నీవు,
నిలి చిలివడి నాకు నిజము చెపుము

మాయ:— వనిసంచరింపను వచ్చి యిచ్చోటను,
ఘనులగు మిముఁ గాంచి కంటిఘనత

కళ్య:—గీ॥ కలికిరో నీవు కన్యకగాను తోఁచె,

మాయ:— సంయమీంద్రహు లేదందు సందియంబు

కశ్య:— ఇంతినా కెంతఁ జేరుమాఁ సంతసమున

మాయ:— నెంత సాహస మిదిబలు వింత యయ్యె.

సంయమిచంద్రమా! నీవు కృతయుగంబునాఁటి ముసలివాఁడవే సౌందర్య లావణ్య తారుణ్య ధన్యయగు కన్యనుఁజూచిన క్షణముననే నీకును వయసువచ్చెను గాఁబోలు. మూడుకాళ్ల ముసలివై తపఃక్లేశంబునఁ గృశించి కన్నుఁదెలిగిన నీకుఁ గన్నెపై మరులుపుట్టెఁగా. ఇంతకును బదియారుకోట్ల నిశాటులను బుట్టించి వారు పుత్ర పౌత్ర పరంపరముగ నభివృద్ధిఁజెందుటఁ గనులారఁజూచి పదమూడు భార్యలఁగట్టికొని వారితో నేగలేక కాననంబుఁజేరి కఠినతపం బాచరించు నీకు మరల వయోవంతుకాలను వింతినిఁగట్టుకొని సంసారంబుసేయు బుద్ధిపుట్టినది వింతగనున్నది. నన్నుఁగట్టుకొని యేమి సుఖంబనుభవింపఁ దలంచితివి?

## అనుబంధము కి.

కశ్య:— భామినీ! నేను బ్రహ్మమానసపుత్రుఁడను. మునవరి నా పరనవు నాకెంతయును. కృతయుగంబుననేఁ బుట్టినను బిలుబితిరోండ్ల వయోవంతుఁడనుగ నేను రూపము ధరింపఁగలను.

మాయ:— సంయమిచంద్రమా! నీకుఁ గామరూపంబులు ధరింపశక్తి కలదా? నేను శుక్రాచార్యుల శుక్రకాంతనై ప్రపంచంబునఁగల మాయాకళలన్నియును నేర్చినాను.

కశ్య:— కావుననే మనమిరువురముఁ గలసినచో మన యిరువురి మాయావిద్యలన్నియును రూపములను గొనినరీతిని నీఁయందు సుతులుద్భవింతురు.

మాయ:— యతివరా! మీరు పెద్దలు - మీమాట నతిక్రమించునంతటి శక్తి నాకుఁ జాలదు. అయిన నాకొక కోరికయున్నది.

కశ్య:— యోషితీ! అదియేమి?

మాయ:— యమీంద్రా! తమతో నేఁగూడునప్పుడు నే నే యేకాలమున నేయేరూపము ధరింతునో మీరు నా కనుకూలముగ నదేరూపము ధరించి నన్నుఁగలసి శక్తిబొంతులగు పుత్రుల నొసంగవలెను? పుట్టినక్షణముననే వారు పెద్దవారలై యుండవలెను.

కశ్య:—చానా! దానికేమి సందేహము. రమ్ము. పోవుదము.

అనుబంధము 6.

(అనుడుఁ జేయిబట్టుకొని పిలుచుకొనిపోవును.)

(నిష్క్రమణము.)

## ద్వితీయాంకము.

### అరణ్యము.

కశ్యపుఁడు - మాయాదేవి - తారకాసురుఁడు.

తారకాసురుఁడు:—(తలిదండ్రులకు వందనమాచరించి.)

మ॥ జనకా! నేజగతిన్ జనించితిని, నాశక్తిన్ గర్వజృంభితిన్.
వనజాతాసనుఁబట్టి కొట్టుదునొ! మహావారాశి, నింకింతునో!
వనజాక్షోయతలో చరున్నలఁచి నీర్వాణింబడన్ వైతునో!
కనకాకాధిపుఁ ద్రుంతునో! తెల్పుమా కల్యాణ తేజోనిధీ.

తండ్రీ! ఏ తెగ నేనుండఁజాలను. నాశక్తికిఁదగిన పనిసేయ సెలవిమ్ము.

కశ్య:—పుత్రా! నీయగ్రజులగు శూరపద్మ సింహవక్త్రులు భువినిజనించి ఘోరారణ్యంబునఁ దపంబు సేయుచున్న వారు. నీవును వారిబలెఁ దపంబాచరించి సమానులలో నుత్తముఁడని ఖ్యాతిఁబడయుము.

తారకు:—నాయనా! అటు ఖ్యాతిఁబడయుటకు నాకిపుడుగల భుజశక్తి చాలదా! తపంబేల?

కశ్య:—తనయా! నీకుఁగల భుజశక్తిచే నజేయత్వంబు సిద్ధింపదు. తపంబున దేవత్వంబును సాయుజ్యపదవియును గలుగును.

తార:—తండ్రీ! నేనే దైవంబును గూర్చి తపంబాచరింతును?

కశ్య:—తారకా! భగవానగు తారకుఁడు శివుఁడు కావున నీవా దైవమును గూర్చి తపంబాచరింపుము.

చం॥ హరిహయుండన్ సురాధిపతి, యాసురవంశకుఠారకుండునై
నిరతము హేళిసేయుచును నీకులమూడ్చి నిమన్మునంజూచు, నా
పరిభవమోర్వంజాలక తపంబొనరించుచు నిన్నుంగంటి, నీ
వరభుజశక్తిం జాటి దితివంశము నిల్పుమ ఖ్యాతిం గాంచుమా.

కుమారా! ఆ యింద్రుండు మహాభోగముల ననుభవించి యష్టదిక్పాలకవరులలో ముఖ్యుండయి యెల్లకాలంబు దితివంశజాలపై దాయాదిమత్సరంబు సాధించుచుండును. వారికిఁ దలకాపు విష్ణుండు.

తారక:—తల్లీ! వానికి యింతటిబల మెచ్చటినుండి వచ్చెను?

మాయ:—పుత్రా! మనవంశమున కాజన్మద్వేషియై మెలఁగుచుండు హరినామంబున మనినాఁడు. సకలమాయలకు నాలవాలమైయున్నవాఁడు. బ్రహ్మయాదిని మన మూలపురుషుఁడగు సోమకుని, మత్స్యావతారమెత్తి చంపెను. పిదప మనవా రమృతము బడయఁగోరి క్షీరసాగరము మథించినతరి మోహినీవేషమూని మన వారిని మోసగించెను. పిదపఁ బందియై హిరణ్యాక్షునిఁ జంపెను. మరల నరమృగమై హిరణ్యకశిపునిఁ జంపెను. వామనుఁడై బిచ్చమెత్తి బలిని బంధించెను. ఆ దేవేంద్రుని రక్షించుటకునై కాచియున్న కుటిలము లుపచరించుచున్నవాఁడు. వానియొక్క మాయవన్నె యెట్టివారికిని దెలియదు. కావున తనయా నీవు నీతండ్రి యాజ్ఞచొప్పున బ్రహ్మనుం గూర్చి తపంబొనర్చి యవధ్యత్వంబు వరంబుగఁ గొనుము.

తారక:—జననీ! చెప్పఁదగినవెల్లను నీవు చెప్పితివి.

ఉ॥ జననీ! చింతిలకమ్మ; నీతనయుఁడీశానున్ గిరీశున్ హరున్
మనమందుంచుచు ఘోరమౌ తపమునున్ మాన్యుండునై సల్పియా
ఘనునిన్ జూచి, యవధ్యుఁడౌ వరమునున్ గాంచున్, సురాధీశునిన్
తనువున్ బాయఁగఁ జీల్చుఁ గూల్చు హరినిన్, నరోన్నతిన్ జూపుచున్.

తల్లీ! నాకు సెలవిమ్ము. పోయివచ్చెద.

మాయ:—తనయా! పోయిరమ్ము. నేనును బోయి యావార్త నీతాతకుఁ జెప్పెద.

(నిష్క్రమింతురు.)

# తృతీయాంకము.

## అరణ్యము.

ఈశ్వరుఁడు - తారకాసురుఁడు.

[తారకాసురుఁడేకాగ్రదృష్టిని నిలిచియుండును.]

ఈశ్వరుఁడు —(ప్రత్యక్షుఁడై)

కం॥ లెమ్మా తారక లెమ్మా
యిమ్మాడ్కిఁ దపము సేయ నితరులకౌనే!
కొమ్మా కామితఫలములను వ
రమ్ముగ నొసఁగెదను నీకు, రమ్మా వేడ్కన్.

ఓహో! తారకా! లోకభయంకరంబగు నీ దారుణతపంబుఁ జాలింపుము. నీ ఘోరతర తపోవహ్నిజ్వాలలు రోదసీకుహరంబు నిండి ప్రాణకోటినిఁ బరితాపంబు నొందించుచున్నది. నీ తపంబుఁ జాలింపుము లెమ్ము. నీకామితార్థంబు లొసంగ నేనిపుడు నీకుఁ బ్రత్యక్షుఁడనైతిని.

తార:—[సమాధియోగంబు వదలి యీశ్వరునిఁ జూచి నమస్కరించి]

సీ॥ త్రిగుణసంయుత తత్వాంతరస్థుఁడై
ప్రాపంచకమునిందు బ్రహ్మవీవ
ప్రథమవర్గాక్షర ప్రథముఁడై విలసిల్లి
జగతిని సృష్టించు స్రష్టవీవ
ప్రణవాభిమందిర ప్రాసాదఖేలన
వరుఁడవై భాసిల్లు గురుఁడవీవ
సత్వరజస్తమస్సంగతి నేకమై
యొకపరిభిన్నమై యొప్పుదీశ

గీ॥ దైవములలోన ప్రాముఖ్యదైవమీవ
నిగమనిలయానురక్తుఁడై నెగడుదేవ
యవ్యయానంద రూపుడ వగుదువీవ
యాశ్రితార్థప్రదాతవౌ యీశుఁడీవ.

మహేశ్వరా! నీమహిమనెఱుంగ మముబోలువారికి శక్యంబెటులగును? దేవా! సకలచరాచరకోటి నిన్ననవరతంబు ప్రస్తుతించుచుండునుగదా! భక్తలోక కామధేనువు నీవనికాదా సార్వకాలములందు సర్వులు నిన్నుఁ బూజించుచుందురు. సకలప్రపంచంబునకు శాంతిఁగలిగించు నాశ్రితపారిజాతంబు నీవనికాదా నిఖిలజనులు నిన్నెల్లపుడుఁ దలంచుచుందురు. ప్రణతచింతామణివి నీవనికాదే సకలప్రాణికోటి రక్షణార్థము నిన్నారాధించుచుండును. వాత్సల్యగరిమచే దాసజనావనమేమవు నీవనికాదా భక్తులు సదాకాలంబు నిన్ను హృదయంబునన్నిలిపి ధ్యానించుచుందురు. త్రయీవేద్యుఁడవై బ్రాహ్మణదైవంబవగు నీ చరణారవిందముల నాశ్రయించి మ్రొక్కెద. మహాదేవా! దీనుని నన్ను పాలింప నీవుదక్క మఱి వేఱుదైవంబు లేదని నమ్మి నిన్నాశ్రయించితి. ధ్యానించితి. భజించితి. సేవించితి. మ్రొక్కితి. [ నమస్కరించును. ]

ఈశ్వరుఁడు:—తారకా! నీ వినయవిధేయతకు నే మెచ్చితి. నీ కామితంబులు నెరవేర్చెద. వేఁడుము.

తారక:—పరమేశ్వరా! నన్ననుగ్రహింతువేని నావేఁడువరమ్ములివ్వి.

సీ॥ నరసురాసురయక్ష గరుడగంధర్వ కి
న్నరసిద్ధసాధ్య పన్నగపిశాచ
భూతగణాదిత్య ప్రేతవిద్యాధర
చారణనైఋతి జాతవేద
యమవరుణేశాన యమిధనదానిల
గజగండభేరుండ గవయఖడ్గ
సారంగశార్దూల శల్యకంఠీరవ
మార్జాలమర్కట మహిషకీటులు.

సీ॥ అచరచరములుభూరి శస్త్రాస్త్రములును
చక్రివక్రంబు పరమేష్ఠి శాపశరము
నన్ను బాధింపనేరక యున్నఁజాలు
నభవ యిదెగొను సాదుసాష్టాంగనతులు.

ఈశ్వరు:— వత్సా! నీ కోరినవరంబులన్నియు నొసంగితి. నా తేజోశక్తి యొకటివలన నీవు తన్నిట నవధ్యుఁడవుగమ్ము. వారప్రముఖ నిఖిలసమూహంబులు నిన్నుఁ దునుమఁజాలరు. సర్వసౌభాగ్యము లనుభవింతువు నజేయుఁడవై సుఖజీవి ముగనుండుము. పోయివచ్చెద.

తార:— శా॥ వంతల్బాసెనుమానసంబునను శర్వాణీమనోనాయకా
సంతోషించితి, మీపదాబ్జముల సాష్టాంగప్రణామంబుల
ర్పింతున్ చిత్తమునన్దలంతు, నినుభావింతున్ సదాకాలముఁ
గాంతాకార నిరంతరాగమ సదస్సంచార, క్షేమంకరా!

అనుచు నమస్కరింప నీశ్వరుండదృశ్యుండగును.

(స్వగత) సెలవుడేమి సేయువారను. వారాక నిరీక్షించుచున్న నా తల్లికి నమస్కరించి కులమువారి కెల్ల సంతోషంబుఁగలిగించి పిదప స్వర్గముఁ బ్రవేశించి యచట నేఁ జేయఁదగిన కార్యంబెల్ల నెరవేర్చెద.

( నిష్క్రమణ. )

చతుర్థాంకము.

ఇంద్రలోకము.

ఇంద్ర, అగ్ని, యమ, నైరృతి, వరుణ, వాయువు, కుబేర, ఈశాన, బృహస్పతి, తారకాసుర, క్రౌంచుఁడు, భానుగోపుఁడు, దంభోద్భవులు.

ఇంద్రు:—( బృహస్పతిఁజూచి ) గురువులనాథా! నాకగురుమర్త్యభువనములయందు కలిగిరి కదా! అంతటఁ నేమగునో?

బృహ:—దేవేంద్రా! నేనన్నివిధంబుల నాలోచించి చూచినను నీకవి యశుభ సూచకములుగ నగపడుచున్నవి. నీకిది కష్టకాలంబు. నీ వైభవోన్నతిం జూచి, చూపోపలేక, కశ్యపుఁడు మాయావతినిఁగూడి ఘోరపద్మ - సింహవక్త్ర - తారకాసురులను రాక్షసులను జనింపఁజేసినాఁడు. వారు ఘోర తపంబాచరించి సర్వేశ్వరుని మెప్పించి యవధ్యత్వంబు వరంబుగఁగొనినారు. వారు నీ సుఖకంటకులై యుందురు. దీనికి నదుపాయంబు వెదకువరకు నీ వా యసురులకు శరణని ప్రాధేయపడుటకంటెను వేఱుమార్గంబు లేదు. తనకుఁ గానికాలంబున గాడిదకాళ్లైనఁ బట్టనగునను నీతి నీవుచక్కఁగ గమనింపుము. ఇదినీకొక గండము. ఈ గండము కొంతకాలంబు నిన్ను బాధించును. ఎట్టివారికిని సుఖదుఃఖ దేవతలిరుగుఁబొరుగు వారుకదా? దుఃఖించినఁ బ్రయోజనంబు లేదు.

(తారకాదుల ప్రవేశము.)

తారకుఁడు:—(భానుకోపునింజూచి) ఓరీ! భానుకోపా! ఆ నీచుని ఇంద్రునిఁబట్టి సింహాసనమునుండి దిగనీడ్చి బంధింపుము (క్రౌంచునిఁజూచి) ఓరీ క్రౌంచా! ఈ యుద్ధమధ్యమున శవ్వరో నన్నుఁజూచి లేవక నిక్కి కూర్చున్నవారు. చెవులు బట్టి లాగుము. (బృహస్పతినిఁజూచి) వీఁడెవఁడో గడ్డనుమ్రింగిన పిల్లిబలె గుటికల్మ్రింగుచుఁ గూర్చున్నవాఁడు. వీనిఁబట్టుఁబట్టి నేనె యాడ్చెద.

బృహ:—అసురవరా! నేను పంచాంగము చెప్పు బ్రాహ్మణుఁడను. నన్నేల హింసించెదవు? వలసినిన నిచటఁ బంచాంగము చెప్పుటదిమాని తమసన్నిధినిఁజెప్పెద.

తార:—అటులొనర్చుము. [ఇంద్రునిఁజూచి] ఓరీ నీచా! నీనిక్కు తగ్గెనా?

ఇంద్రుఁడు:—అసురేశా! నీవు నాయనుజుఁడవు. నీసరివా నాపౌరుషము.

తార:—ఓరీ! ఇంద్రా! నీకీపదవిరయులు?

ఇంద్ర:—తమ్ముఁడా! నీవేయనుభవింపుము. నేననుభవించి వేసరితిని.

తార:—కాని! నేను మరలవచ్చినప్పుడు నాకీపదవి నప్పగింతువఁట. నీ వింతటినుండి తారకదాసుఁడని పేరుపొందుము.

ఇంద్ర:—తమ్ముఁడా! అటునామముంచుకొనుటకు నాకేనందియము లేదు. ఒకశంకమాత్రము బాధించుచున్నది.

తార:—అదియేమి?

ఇంద్రు:—నేను పెద్దవాఁడను. నీవు చిన్నవాఁడవు. నీకాప్తుఁడు స్నేహిన నీ యాయువు వృద్ధినొందునని బోధించుచున్నాను.

తార:—ఓరీ! మూఢా! నా సామర్థ్యంబు నీవు తెలియఁజాలక యున్నావు. సమస్త జీవకోటి లలాట తలవిధిలిఖిత దుర్లిపి నశనయించుశక్తి నాయందున్నది. ఇపుడేపోయి బ్రహ్మనుబట్టి కట్టెద.

ఇంద్రు:—తమ్ముఁడా! ఇపుడెగదా నేసంతసించితి.

తార:—ఓరీ! మూర్ఖా! తమ్ముఁడాయని నన్నుఁ బిలువకు. స్వామీ! దేవా! అని పిలువుము.

ఇంద్ర:—స్వామీ! అటులొనరించెద.

తారక:—ఓరీనీచా! నీసంబంధముతో నాతల్లిఁజేరి యాఁమెపాదములకు వందనంబులర్పించి రమ్ము. పొమ్ము. [ సింహాసనమెక్కి ] ఓరీక్రౌంచా! ఈనీచులెవరు?

క్రౌంచ:—దేవా! తెలిపెదవినుఁడి (చెవిఁజెప్పుచు.)

వం॥ అతఁడుసమస్తపాకముల నాయిలపెట్టు నితండుజీవముల్
చెతగహరించుదొంగ, మనవీడునఁబుట్టిన ద్రోహియీతఁడా
యతఁడుజలంబుమోయు, నతఁడంతటగాలినివీచు, నీతఁడో
యతిశయభాగ్యగర్వి, మఱినాతఁడుశర్వునియంశుఁడైమనుగా.

తారకు:—( లేచివచ్చి యాగానునిఁజూచి) దేవా! నీవేల యీ నీచులతోఁ గూడితివి. వెళ్లి నీస్థానంబున నీవుండుము. (క్రౌంచునిఁజూచి) క్రౌంచా! వీరికెల్లరికిని పెద్దలయెడఁ జూపఁదగిన గౌరవమును నీవు శిక్షించి తెలుపుము.

క్రౌంచ:—చిత్తము. [అగ్ని, యమ, నైరృతి, వరుణ, వాయవ్య, కుబేరులను తెచ్చిపెట్టి యాఁడించి తారకునకు వందనంబొనర్పఁజేయును.]

తార.—క్రౌంచా! వీరుసేయఁదగినపనులు వీరికెఱింగింపుము.

క్రౌంచ:—చిత్తము! (అగ్నినిఁజూచి) అగ్నీ! మాదొరగారియింటిలో వంటవాఁడుగ నుండుము. (యమునిఁజూచి) ఓరీదండధరా! మాదొరవారి యాస్థానమున వేత్రపువాఁడుగ నుండుము. ( నైరృతినిఁజూచి ) ఓరీకులద్రోహీ! మారాజాగారింట

వీరికార్యము లొనర్చుచుండుము. (వరుణునింజూచి) ఓరీవరుణా! నీవు వీరింటి నీరు మోయుచుండుము. (వాయువుంజూచి) వీరికిగాలి విసరుచుండుము. [ధనదునింజూచి] కుబేరా! నీవు వీరింట వస్తువులు విచారించు కార్యమువహింపుము.

తార:--[భానుకోపునింజూచి] భానుకోపా! అచట నిలచినవారెవరు?

భానుకోప:-- దేవా! వీరిచటనుండు భోగమువారు.

తారక:--వీరిచట నేమిసేయుదురు?

భాను:--పాడుదురు. - నాట్యమాడుదురు.

తార:--ఏదీ యెటులపాడుదురో, ఎటుల నాట్యమాడుదురో చూతము.

భాను:--రంభోర్వసులారా! మా దొరగారియెదుట పాటలుపాడి నాట్యమాడుఁడీ.

రంభోర్వసులు: -(స్వగ) ఈ వ్యసనమున నుండువారికి పాటయుఁట నాట్యముఁట.

(ప్రకాశ):-- మంచిదండీ అటులొనర్తుము.

( పాటపాడుదురు - నాట్యమాడుదురు. )

అనుబంధ 8.

అనుబంధ 9.

తారకా:—భానుకోపా! వీరిరువురిని, సురల నిట్టివారిచట నెందఱుండినను వారిని మన పురిఁజేర్పుము.

భానుకోపః:—మంచిదండీ! ఇట్టివారిఁక ననేకులున్నారు వారినిఁగూడఁబట్టి తమవశముఁజేసెద.

తారక:—ఇప్పటికి వచ్చినపని ముగిసినది. ఇఁకనేను బ్రహ్మలోకంబుఁజేరి యాధాతగర్వ మడంచివచ్చెద. పిదప వైకుంఠంబుఁజేరి యాహరినిఁబట్టి చెఱయుందుం జెద. క్రౌంచా! భానుకోపు నిచటవదలి నీవునావెంటరమ్ము.

( నిష్క్రమణము. )

ష్ణుడు హరిబ్రహ్మలు నన్ను నేకవిధముల వేఁడికొని నాసుతను దాక్షాయణిని వానికిఁ ప్పించి పరిణయంబొనర్చిరి. మూర్ఖుఁడగు నేను వివాహమహోత్సవము సలుపునపుడు కూడినబంధువులయెదుట నాకగౌరవముగులాగున వివాహమధ్యమున నద్భుత్యుండాయెను. నాసుత నాచర్యలకు దుఃఖించుచు నాయింటనుండ, ముడియదిదుపువసువున నెప్పుడో వచ్చి నాబిడ్డనెత్తికొని పోయినాడు. బ్రహ్మసేయు యాగంబున వానికింకరుఁడు శిలా దుఃడు వచ్చి దిరించి యాగవిఘ్నంబొనర్చి నవనవమహోత్సవవిధ్వంసేస నేకెంచిన పెద్దలకవమతిఁ గలిగించెను. ఇట్టిధూర్తను దైవముగనెంచి పూజించువారికి మతిమాంద్య ముగాని వేలొకటికాదు. వానిగర్వభంగముగ నేనిపుడు నిరీశ్వరయాగంబొనర్ప సమ కట్టైద.

చం॥ మితిఁగనలేనిగర్వమున మించినశర్వునియుక్కడక్కఁగా
పితగళునిజాసతిన్వదలిసేయుదు నేను నిరీశ్వరాధ్వ స
మ్మతమనివార్యజాల్ సురలుమౌనివరుల్ ననుమెచ్చఁగా,మహో
ద్ధతినిమదించువానికిని దప్పునిశిక్షయు పేరుయేగదా!

ఇట్లుదేపోయి దేవతాశిల్పినిఁ బిలిపించి యజ్ఞవాటిక నిర్మించెద. పోయెద.

( నిష్క్రమణము. )

శ్రీ

# గిరిజాకల్యాణ నాటకము.

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

### కైలాసము.

దాక్షాయణి - ఈశ్వరుడు.

**దాక్షాయణి:**—ప్రాణనాథా! తమసన్నిధిని నిలిచి మాటకుమాట యుత్తరంబిచ్చుచు నుండుటనంతటి ధూర్తను గాను. మీరయి దయచేసి సెలవిచ్చిన రెండుదినములు పుట్టింటికిఁ బోయివచ్చెద.

సీ॥ కను వేడుకయ్యెను కన్నతల్లినిఁ గాంచఁ
గనికరముంచి నన్ను సుఖనాథ
అక్కలఁ గలిగిన యక్కజెల్లెండ్రను
గాంచివత్తును ప్రాణకాంత వినుము
చిన్నతనమునుండి మన్ననలందిన
చెలులతో భాషింపఁ జెలఁగు మనము
కనుకాలమయ్యెఁగా నుడిబ్రాలునిడుకొని
పుట్టింటికిని నేను బోయివత్తు
గీ॥ పెద్దకాలమునకువచ్చెఁ బెద్దకూఁతు
రనుచు నాతండ్రి ననుఁ గని యాదరించు
రెండుదినములు సెలవిమ్ము యుండివత్తు
నడిగికొని యెద నడుగులఁ బడుచు నాథ.

ప్రాణకాంతా! తామై సెలవిచ్చిన నేఁబోయి రెండుదినములుండి తిరిగివత్తును? కాదనిన నా ప్రీతియంతయు, యనుకొని పడియుండెద.

**ఈశ్వరుఁడు:**—మోహనాంగీ! పలవని పీనులలో పీడుకట్టుకొని నే నెంత బోధించినను నీవు వినవు. దీనినుండి యనేకానర్థంబులు కలుగును నిక్కమిది.

మ॥ వలదా! యీబలవంత మేలవిడుమా; వామాక్షిరో! యప్పటన్
గలుగున్, నీకునగౌరవంబు, వినునిక్కంబిద్ది, నీతండ్రి - కే
వలవైరంబునునాపయిన్ గన్నెఅపి, క్రోధాగ్నిరంగనీయజ్ఞమున్
సలుపన్ జూచు, ననర్థమిందుగలుగున్, చానా, మదిన్ గాంచుమా.

ప్రాణేశ్వరీ! ఆహ్వానములేక పోయితివేని నచటనీకు మానహానికలుగును. నిక్కమిది. దానినుండి మనస్తాపముఁగలుగును. నీవాడుదానవు కావున వెనుకముందాలోచింపక మాటలాడెదవు. అపుడే స్త్రీనచుఁడీశ్వరుఁడని నా కపఖ్యాతివచ్చినది. నీమాటలు చెవినఁబాల.

దాక్షాయణి:—హా! హా! ( ఏడ్చుచు. )

గీ॥ మోమువాచెఁదల్లి మోముఁజూడఁగనాకు
బలగమెల్లనందుఁ గలసియుండు
వారినెల్లఁజూచు భాగ్యంబులేదాయె
నాడుపుట్టువగుట వ్యర్థమపని.

అయ్యో! ఆడుపుట్టువయి జగతినిఁ బుట్టుటకంటెను దౌర్భాగ్య జన్మము, వేరొకటియుండదు? ( ఏడ్చును. )

ఈశ్వరుఁడు:—(స్వగ) ఈబోటి నామాట యించుకయైనను సరకుఁగొనక యుక్తాయుక్తము లాలోచింపక, మీఁదవచ్చు నపయశము గణింపక, యేదృష్టితో నన్నుఁదనవశునిగఁ జేసికొనుచున్నది. ఇట్టి మాయామహిమగల వారాడువారు కావుననే యెట్టిబలశాలి పురుషునినైన తమవశవర్తులఁ జేసికొని కీలుబొమ్మలవలె నాడించుచుందురు. కొందఱు మాటలచేతను కొందఱు క్రేఁగంటి చూపులతోను గొందఱు చిఱునగవుతోను కొందఱేడ్పులతోను బురుషుల నేలుచుందురు. స్త్రీ మాయ ముందట పురుషులబుద్ధి దిగఁదీసి వేయవలసినదేను.

ఉ॥ కొందఱువాక్చమత్కృతినిఁ గొందఱు వింతగువాలుచూపులన్
గొందఱు ముద్దునవ్వులను, గొందఱుగుల్కులఁ గొందఱల్కలన్

గొండలు పాపభావములఁ గొండలుధిక్కృతిఁ గొండలుగ్రులన్
బందలఁజేయువారు మగవారిని స్త్రీలబలంబు చిత్రమౌ

ఈ దాక్షాయణి తనయేడ్పుల నన్ను వశపఱచుకొని నాదౌర్భాగ్యముఁ బోకార్చును. ముందెటులైనఁగానిమ్ము. ఇపుడు పోయిరమ్మని సెలవిచ్చెద. (ప్రకాశ) మోహవార్ధీ! నామంత్రము నీపైసాగదు. నీవిధిమూర్ఖపట్టుపట్టినది మనవిరహవియోగంబునకుఁ గారణంబగునని నేఁ జింతించెద. ఏమయినను గానిమ్ము. నీవుపోయిరమ్ము.

దాక్షాయణి:—నాథా! ముదమందితి. వియోగము చిరకాలమని తలపకుఁడి. కొంత దినములలో మరలివచ్చెద. ( నమస్కరించును. )

ఈశ్వరుఁడు:—మంచిది.

( నిష్క్రమణము. )

ద్వి తీ య రం గ ము.

ద క్ష య జ్ఞ వా టి క.

దక్షుఁడు - బ్రహ్మ - హరి - ఇంద్రుఁడు - బృహస్పతి - దధీచి,
దిక్పాలుడు - దాక్షాయణి.

( సభాసదులందఱు నుచితాసనంబులఁ గూర్చుండియుండ దక్షుఁడు లేచి )

సీ॥ వారిజలోచన వారిజాసనులార
ధన్యతఁగంటి మీదర్శనమున
అమరేంద్రనీ శుభాగమమున నామనం
బతిశయమోదంబునందెఁగనుమ
యతివరులార మీయతిశయదయఁగనఁ
బిలిపించితిని మిమ్ముఁ బ్రీతిగాను
గురువరా! కృపనునీగురు భారమునుఁదమ
నాపుపైమోపితి ముఖ్యులనుచు.

సీ॥ సవనమిది కష్టతమమైన, సలుపవలయు
యజ్ఞములులేక బహుకాలమయ్యెఁగనుఁడి
నాఁటివిధికృత యధ్వరమేటఁగలిసె
నాశిలాదుని దుర్నీతిమతిశయింప.

సభాసదులారా! త్రిలోకంబులకు క్షేమకరంబగు సవనంబులు బహుకాలంబు నుండి నిలిచిపోయినవి. అటులగుటకుఁ గారణంబా శిలాదుండను నంది దౌష్ట్యము చేరానాఁడు వానికి జెలంచితిరి కావున యజ్ఞంబులిటు నిలుచుటకుఁ గారణంబయ్యెను. ఇటులనే నిలిచిపోయినయెడల బ్రాహ్మణకర్మలు నిలిచిపోయి జగతిని ననిష్టములనేకము లుత్పత్తిల్లును. ఇవియన్నియును జక్కఁగనాలోచించి బ్రాహ్మణులను విచారించి యీ సవనంబుసలుప సాహసించితి. ఇక్కార్యంబు సమకూర్ప మీరెల్లరు సమర్థులని నమ్మినాఁడను.

దధీచి:-(లేచి) దక్షబ్రహ్మ! సద్బ్రహ్మలలో నగ్రగణ్యుఁడవు. మహాతపస్సంపన్నుండవు. ఈశ్వరవరప్రసాద మహైశ్వర్య సంపూర్ణుండవు? నినుఁబోలు మహనీయుఁడు సలుపుయజ్ఞంబునకు కర్తయెవరయినది తెలియంగోరితి.

దక్షుఁడు:— దధీచీ! దాసినడుగనేల? సర్వరక్షకుఁడగు సరోజాక్షుఁడీ సవనంబునఁ గర్తగనుండును.

దధీచి:—ఏమీ! ఏమీ! హరిహిరణ్యగర్భాది త్రిదశపశువులం సృజించి ప్రళయావసరమున నశింపంజేసి నిఖిలాధ్వరంబుల హవ్యభక్షకుఁడును హవిస్స్వరూపుఁడును, నగ్నినయనుండును, క్రతురక్షకుఁడును సర్వదేవోత్తముండును, విశ్వాత్మకుండును, విశ్వరక్షకుండును, విశ్వేశ్వరుండును, విశ్వవృత్తివేత్తయునగు నీశ్వరుని సవనకర్తను జేయక యితరులను బూజ్యులఁజేయుట తన్నుఁబుట్టించిన తండ్రిని దండ్రియనక సహ్యాళని తండ్రిదాసుని తండ్రియనిపలికినట్లగును. ఈశ్వరరహితమైన యాగంబొకయాగంబగునే. చక్కఁగవిచారింపుము.

చం॥ త్రిభువనకర్తయై మెలఁగు దేవునిఁ ద్ర్యక్షుని ధిక్కరించి నీ
శుభమెటు నీకుఁగల్గును? త్రిశూలివరమ్మున నందితీవు దు

శ్లథమగుసంపదల్; మఱినిరంతరమద్ది తలఁచుచుండుమా
యుభవుఁడులేనియాగ మొకయాగమె? భోగియునైనమెచ్చునే?

వత్సా! నాహితంబుఁగని సర్వమంగళుండగు శివేశ్వరునిఁబూజించి యజ్ఞకర్తగ నొనర్పుము. నీకుశుభమగును.

దక్షుఁడు:—(కోపముతో) ఏమీ! దధీచీ! త్ర్యక్షునిపక్షమూని నానిర్దాక్షిణ్యమున నెంతెఁ గఁగొనియాడెదవు? మత్తనూజ పరిణయసమయమున బంధువులందఱుఁ గుమి గూడియుండఁ నాకుసమానుఁడవంబుగఁ బెండ్లి యుత్సవకాలమున దుటుమాయ మైపోయిన సంగతి నీకుఁదెలియనివార్తయా? పిదప నాకుఁదెలుపకనె నా బిడ్డను దొంగలవలెనెత్తికొనిపోయినది నీవెఱుంగవా? కృత్తికాద్యోగాసక్తుఁడయి మిగతబిడ్డల ననాదరముఁజూచిన చంద్రునకు ‘‘క్షయరోగమున క్షీణాంశుఁడగు మని’’ నే శాపంబిచ్చినది తెలిసియుఁ వానినిఁ జేరందీసి సంపూర్ణాంశునిఁజేసి తలపై నెక్కించుకొని నన్నుధిక్కరించినది నీకుఁదెలియదా? పైనయి తిమ్మఁజూడఁబోవ నన్నుఁజూచియుఁ జూడనివానింబలె నటించుచు మాటలాడింపక తిరస్కృతిని నన్నవమానపఱిచినది నీకునేనుదెలుపవలెనా? ఇట్టియున్నయెడ నీవెఱింగియు మరల వానినామంబుచ్చరించి శత్రుపక్షంబువలె వానిఁ గొనియాడుచుంటివే? నిన్నే మందును?

దధీచి:——వత్సా! సర్వమెఱింగిననీవు పామరునింబలె నజ్ఞానంబునఁ బడుచున్నావు.

సీ॥ కర్తయు భర్తయు హర్తయు శంకరుం
డనుచును నుడువవేదాగమములు
కనఁగసర్వవ్యాపకత్వము సర్వాత్మ
కత్వము హరునందెఁగానఁబడదె
విశ్వాత్మకుండును విశ్వరక్షకుఁడును
విశ్వేశ్వరుండు మహేశ్వరుండు
హర్యజుల్ వాసుదేవాది సురవర్యులు
పసులైనఁబేలికఁ పశుపతి యనుహరుఁడు



గీ॥ కనవె భక్తాభయప్రదుఁ గాలకంఠు
నీశ్వరుని చిత్రచరితంబు లెల్ల నీవు
కనియు వినియును నజ్ఞానికరణి, యాగ
మంచితంబని సేయ ఫలించు నెటుల?

దక్షా! నా హితంబు వినుము. నిరీశ్వరయాగంబు నిష్ఫలమగును.

దక్షుఁడు:—ఏమీ! భిక్షమెత్తి యుదరము నించికొనుచు, ఇల్లువాకిలి కానక యొలికి యందు నివసించి కొండలు గుట్టలు దిరుగుచుఁ భుజగముల నే భూషణములుగఁ గొని యెముకలు పేర్చనుంచుకొని, యొక పాత్రమైన లేక కపాలకపర్దము చేతఁ బూని గంపపుం బూడిద గతి లేక స్మశానములోని బూడిదె మైపూతఁగఁ బూసికొని తలపై నెల్లకాలము నీరు మోయుచు పిశాచగణములం గూడి సాయంసమయమునఁ దాండవ మాడుచు పతివ్రతా స్త్రీలను జెఱచుచు, మాయలు బచరించుచు, నిత్యభిక్షుఁడై, తిరుగుచు కృతయుగమునాటి, ముసలి యెద్దునెక్కొని సంచరించుచు నమంగళకరుఁడై విషమును నోటనుంచుకొని జీవయాత్ర జరుపు దిగంబరుని గజచర్మవాసుని నసహ్యమూర్తిని దేవోత్తముఁడని లజ్జమాని భయము లేక మహామహితాత్ములందఱిచట గుమిగూడియుండ వారిని కాదని నీవు పలికితివి గదా? నీ కార్యము హెచ్చు.

చం॥ కుడువను కూడు లేదు; నడికొండ బిడారము; దంతిచర్మమే
యుడుపు; నివాసమో యొలికి; యుల్లమొ యుగ్రము; మేనిపూతయో
వడఁగొను బూది; పెక్జడలో వంకరటొంకర పేగులక్కటా
జడుఁడు; పిశాచసేత యనిశంబు నసహ్యకరుండు; వాని నే
నొడయని గా మనస్తునెటు! లోపనుహీనునిఁ బెద్దఁ జేయఁగన్.

దధీచీ! జాతిలేని హీనునిఁ బెద్దఁ జేసి మాటలాడకు, నీ హితంబు నాకు వలదు. మిముఁ బోలువారి హితంబులిదివరకే నే విని బిడ్డనిచ్చి మోసపోతిని. ఇప్పుడు దానిఁ ద్రవ్వికొనినఁ బ్రయోజనంబు లేదు.

దధీచి:—ఏమీ! దక్షా! ఇంతటి యజ్ఞానివైతివి? కూఁతునిచ్చి జాలి సెంచవా? నీ కా

రించిన దూషణలోని యంతరార్థమును రయోధింప నొక్కఁడైనను నిక్కముఁగా నడిచియా? శబ్దవైలక్షణ్యమున దూషణగ బాహ్యమునకగపడినను సర్వజ్ఞుఁడ యునసివుఁబోలువాఁడు నిజమెఱుంగఁ రాదా? తననిజమును తండ్రిస నెఱుంగక దాసీతనయుఁడన్యుఁ దనతండ్రిగఁ జెప్పుకొనినరీతిని నీవాచరించుచుంటివా? పూర్వ నర్జునిఁ బూజించినవాఁడు సంపద్విహీనుఁడు కాఁడా?

## అ ను బ ం ధ ము 10.

దక్షుఁ:—దధీచీ! ఈ యాగానాదిగ నేకాదశరుద్రులున్నవారుగదా? వారినైనఁ బూజింపఁదలఁచితిగాని యాకృత్తివాసునిఁ బూజింపను.

దధీచి:—దక్షా! ఏకాదశరుద్రులకు సర్వాపు దేవ సమానత్వం బెటులగును. శివునిఁగూర్చి యనేకశతవత్సరంబులు తపంబొనరించి సారూప్యరూపంబు పొందినారు. అంతమాత్రముతోనే వీరు పశుపతికి బ్రతిరైరి క్రతువులఁ బూజనుఁగొన శక్తు లెటులగుదురు?

దక్షుఁడు:—దధీచి! నీమాటలు చాలింపుము.

గీ॥ కాదు నీవుగఁగల్గు నాకారహీనుఁ
కృత్తివాసుని బికీరంబు నెత్తువాని
బూతిమైపూతఁగల బూతుజేని నేను
పిచ్చివాఁడనెపూజింపఁ? జెచ్చు లేల!

చాలు చాలు. నీమాటలు వినఁజాల.

దధీచి:—దక్షా! నీ దూషణశబ్దములలోఁగల యంతరార్థంబు నీవు తెలిసినావని నే నెంచి యుంటిని. నీవు నాకుఁ జిరకాలమిత్రుఁడవు కాన నీవు వలదనినను హితము నుప దేశించి నిన్నుఁ జక్కఁబెట్టుదునని వాయుది. నామాటలు చెవులఁజొనిమ్ము ఈశ్వరుని జగజ్జనకుని దూషించి చెడకుము. నీకుఁగల మహైశ్వర్యంబునకుఁ గారణం బాతఁడు. అతని నైల్లిదంబుగఁ బలుకకు.

దక్షుఁడు:—దధీచీ! నీవు నాకుఁ జిరకాలమిత్రుఁడవు కాన నేకాదశరుద్రులలో నీవలెకి వానినొక్కనిఁ దప్ప వింగతవానినిఁ బూజించెద.

కం॥ అతిహితమతినుం డెడు, యతి
సతులకుఁ బెఱమతులుగలుషి సంధించిన, దు
ష్కృతికిని హరునకుమును లెటు
సతులిడిరో! దీని నెటులనమ్మఁగవచ్చున్.

దధీచి:—దక్షా! ఇదినీవు నమ్మవేని నక్కాలమున మోహినీవేషధారియై మునులసౌర్య మఁజెంచి చెండాడిన మురారియున్నవాఁడు. ఆ పరోక్షాత్మని విచారించి నిశ్చయించెఱుంగుము.

దక్షుఁడు:—నేనునమ్మని విషయములో వారిని వీరిని నడుగనేల? ఒకవేళ నదినిజమై నను హరునికృత్యంబు నింద్యంబుగదా? అట్టిదుష్టుని వందుష్యునిఁ జేయనేలఁ బలదు. ఆ గజచర్మవసునిమాటలేల?

దధీచి:—దక్షా! గజచర్మవసనుఁడని దూషణగఁబలుకకుము. భక్తియుక్తిని వ్యాఖ్యానంబు సేయువారికి నదుని మోచనంబగు.

కం॥ త్రిజగమును నేచుచుండిన
గజదైత్యునిఁబట్టిచీల్చి కల్యాణుఁడౌ
వృజినపరిహారుహరునిఁ
గజవర్మాంబరుఁడటన్నఁ గలుషమడంగున్.

ఓరీ దక్షా! చిరాయుర్బలపరాక్రమంబులు వరంబుగఁగొని త్రిజగకంటకుఁ డగు గజదైత్యునిఁజీల్చి, జగంబునకు వానిచర్మంబేయుపకృతియొనరించునోయను సందియంబున నా పాపిలోలు తనవలువగధరించెను. జగత్పాలనకై యొనరించిన జగదీశ్వరుని కృత్యంబెటునింద్యంబగు?

దక్షుఁడు:—దధీచీ! జగత్పాలనకై గజాసురునిఁజంపెననిన నెటులైననమ్మెదను. రక్తసిక్తమై దుర్గంధయుక్తమైనవాని చర్మమును రోతయనక ధరించిన హేయత్వంబెంత దూషించినను దక్కువయని నేఁదలంచెద. కావున నాకమితకర్పరుని, నా విపధకుని నామంబు నాయెదుటనుచ్చరకు.

దధీచి:—దక్షా! సర్వేశ్వరుని కపాలకర్పరుఁడనియును విషభక్షకుఁడనియును దూషింప నేల? పరమేశ్వరుఁడు దానినిధరింపకున్న నేనును నీవును నీజగత్తియునుంట యసంభవమగుచుండెను. క్షీరసాగరమథన కాలమునఁబుట్టి జగత్త్రయమొన రించు విషమును హర్యజ సురాదులచేఁ ద్రిలోకోలుపని విశ్వేశ్వరుఁడు దానిని భక్షించి జగములరక్షించెను. హాలికఁగల గర్వముడంచుటకై కూర్మంబును గర్వగంబు గఁగొనెను.

దక్షుఁడు:—దధీచి! నీవాడుమాటలు నీకుసమ్మతములుగ నున్నవి గాని సభాసదులకవి సమ్మతములుగావు. జగములఁ గాల్చుచున్న విషమునుదీసి పాలఁబోయక మ్రింగెనఁట. ఇది యపస్మారకుని కృత్యము. పాములఁ బట్టువాఁడు సైతము విషముఁదిని హరించుకొనును. అగ్నినితిని ముదిరినవారికి విషముఁభక్షించు దుర్గుణముకలదు. ఆ రక్త కపాలభిక్షుని నామంబునుడువకు.

దధీచి:—దక్షా! ఈశ్వరుని దూషించుచు నీవాడు ప్రల్లదంబులు చేసినఁజాలు.

గీ॥ పంచశిరములు దనకును బరిఢవిల్లె
పంచవదనుని హెచ్చేమియంచు ధాత
గర్వపూరితుఁడైనది కనుచు హరుఁడు
పంచమశిరంబుఁద్రుంచి కపాలియయ్యె.

దక్షుఁడు:—హా! హా! దధీచీ! ఎంతటి యసూయాపరుఁడా హరుఁడు? తనసమాన మొకరు నుండఁగూడదను కడుపుగిచ్చు కాఁబోలు. వలదునాకు నీ హితము? హీనునిఁ బెద్దఁజేసి నేఁబూజింపఁజాల.

దధీచి:—ఓరీమూర్ఖా! పరాత్పరుని పరమాత్మను నిఖిలాంతర్యామిని, దేవదేవుని, సృష్టి స్థిత్యంతకారణుని, పరంజ్యోతిని, భీతిలేకనిందించు నీసరస నిలుచువారికి ప్రాయశ్చిత్తానర్హ పాపంబొదవును. "వినాశకాలే విపరీతబుద్ధి" యనినటుల నీకు వినాశకాలంబు సంభవించినది. మూర్ఖునితోభాషించిన వానికిఁ గీడుమూఁడును. కావున నేనిచట నుండఁజాల. ఆపదలు పైఁబడి బాధించునపుడు దధీచి హితమువినసైతినే యని నీవుపశ్చాత్తప్తుఁడయ్యెదవు. కానిమ్ము నేఁబోయివచ్చెద.

(నిష్క్రమణము.)

దక్షుడు:—(స్వగ) కనిపెడతెను. (ప్రకాశముగ) సభాసదులారా! ఈ దధీచి యీశ్వర పక్షపాతియై దుర్వాక్యజాలంబు లెన్నొ పచరించె. ఎందఱినిదూషించె. ఇట్టి వాని మాటలకు వెఱచి చేఁబట్టినవస్తు వదలుదునా? ఎన్నటికిని వదలను. (బృహస్పతినిఁజూచి) మాటలలోఁ గాలమాయెను. ఇఁక సవనకార్యంబుఁ బ్రారంభింతము.

బృహస్పతి:—కానిమ్ము. సంకల్పమునకుఁ బ్రారంభింతము.

దక్షుడు:—ఆచార్యులవారు సంకల్పములోనైనను మంత్రములోనైనను శివనామంబు రానటుల జాగరూకతఁ గలిగియుండుఁడి.

బృహస్పతి:—మంచిదండీ! అటులొనరించెద.

(దాక్షాయణి ప్రవేశము.)

దాక్షాయణి:—(స్వగతము) ఏమిది! నా ప్రాణపతి పరమేశ్వరుఁడనినవాక్కు లన్నియును సిద్ధించెను.

సీ॥ కన్నతల్లియు నన్నుఁ గన్నెత్తిచూడక
మన్నన సేయక మమతవీడె
అక్కచెల్లెండ్రైన నొక్కమాటాడక
దవ్వున నుండు, కతంబదేమొ
బలగమెల్లను జేరి కలయుపల్కులుపల్క
యాదరింపక మౌనమునుగువారు
చిన్నతనమునుండి చెలిమిని నాడిన
చెలులేరు ననుఁజేరి పలుకరైరి.

గీ॥ కన్నబిడ్డను ననుఁ గాంచి కనులఁగప్పి
కొనక నాతండ్రి మౌనముఁగనె నదేమొ
పుల్లవిఱచిన చందానఁ బురుషుఁడనిన
వాక్కులన్నియు నిటఁ జూడ నిక్కమయ్యె.

అయినఁ గానిమ్ము. దీనికిఁ గారణంబు నాతండ్రినే ప్రశ్నించి నిజంబెఱింగెద. (ప్రకాశముగ దక్షునిఁ జూచి) తండ్రీ! నాయనుజలను దత్పతులను పిలిపించి సన్మానంబుల సంతుష్టులం జేసి తనూజనగు నన్ను పిలిపింపని కారణంబేమి! నీవు పిలిపింపకున్నను, ననాహూతనై నేనై వచ్చినపుడు నన్నీ రీతి ననాదరింపనగునా? నన్నుగన్న తల్లియైనను నన్నుఁ గాంచి యొకమాటయు నాడదే? చెల్లెండ్రందఱు నన్నుఁ గాంచినతోడనే యసహ్యంపు వస్తువునుఁ గనినవారింబలె దూరమరుగుచున్నవారే కారణంబేమి? బంధుజనములకు నేనొనరించిన నేరమేమి? వారేల నన్నుఁ బలుకరింపరు? చిన్ననాటినుండి యాటపాటలఁ జెలిమిఁ జెందిన చెలులేల నన్ను సమీపింపరు? ఇది నీయాజ్ఞయని నేఁ దలంచితి.

దక్షుఁడు:—[దాక్షాయణిఁ జూచి కోపమున]

ఉ॥ వచ్చితి వేలనీవిటు లవశ్యము రమ్మని నీకు నేరు వా
గ్రుచ్చిరి? లేఖఁ బంపిరి? యఘోరదరిద్రుని దారవైన నీ
విచ్చటు, రా, సమంజసమె? భిక్షుకు భామినులుండుచోటికిన్
జేచ్చెరఁ బొమ్మ నిల్చినను జేటగు నీకు నిజమ్ము వెళ్లుమా.

భామా! నీవమంగళకరుఁడగు భర్గుని భార్యవు. అజ్ఞాతగోత్ర సంభవుండును ననాచార ప్రవర్తనుండును నగు భూతపతి నాతివి. నీవు ప్రేతభూమిని నుండఁదగిన దానవు గాని మంగళోత్సవంబులఁ నుండఁదగిన దానవు గావు. చెచ్చెర వెళ్లి రుద్రభూమినిఁ దాండవమాడు నాథునిఁ జేరుము. వెళ్లుము.

దాక్షాయణి:—సర్వమంగళకరుండగు శంకరుని దూషింపనగునా? రుద్రభూమినిఁ దాండవమాడు వాఁడని నిందించితివే? దాని గూఢార్థంబు సకలాగమవేదివగు నీకుఁ దెలియదా?

క॥ ప్రళయసమయంబునందునఁ బ్రాణికోటి
యెల్లలయమగు నత్తఱి, వల్లకాడె
యగునంభువిసర్వ మప్పుడా యభవుఁడొకఁడె
స్థిరముగ నునిల్చునచ్చోట క్షేమముగను.

తండ్రీ! సకలభువనంబులు ప్రేతభూములుగ మారినపుడు సృష్టిస్థితిలయకరుం డగు నీశ్వరుండొక్కరుండచట స్థిరముగ నిలుచు కారణంబునం గాపురులంతరార్థంబుఁ దెలియక స్మశానవాసుఁడని పిలిచినమాత్రాన నీవునట్టి యజ్ఞానంబునఁబడి యీరీతి నీశ్వరుని దూషింపనగునా?

## అనుబంధము. 11.

దక్షుఁడు:—[స్వగ] కోరా యాకుదానిమాయాని పలుకులు; [ప్రకాశముగ] భ్రష్టా నిన్నట్టి నేఁడు కన్న తెలిచితివి? ప్రళయమునాఁటి మాట నీకెటు తెలుసును? నీ వెదుటనుంటివియా? చాలు చాలు ఆ భస్మాంగుని కొనియాడకుము. నే వినఁజాల. సహింపఁజాల.

దాక్షాయణి:—జనకా! నన్ను నీవెంత దూషించినను దూషింపుము. ఆ మహామహుని లోకకర్తను నీశ్వరుని, నాప్రాణనాథుని, నొకపల్లెత్తుమాటయయిన నాడకు. నే విననోపను. సహింపనోపను. నాపతిని భస్మాంగుఁడని దూషించితివే? అటుదూషింపనగునా? నా మగఁడు భస్మాంగుఁడు కాకయుండినచో, నీవును నేనును, నిచటఁగలిసిన సభాసదులును వేయేల భూతకోటితోనిండిన యీ ప్రపంచంబును, నగపడుచుండెనా?

సీ.। ప్రళయసమయమునందునఁ బ్రాణకోటి
నీటఁగలయుచుఁ బోనీక నీటుగాను
వాని నెల్లను బూడిగ మేనఁబూసె
మరలిసృష్ట్యాది వదలుచుమనఁగఁజేసె.

ఇట్టిమహాత్ముఁ గురుపూజ్యుని, హవిర్భాగపాత్రునిఁ జేయక, నీవొనరించిన సవనంబు సఫలంబగునా? నీకు బుద్ధిఁ జెప్పువారిందఱుండినను నీభయమున నీకుమాఱుపలుకకయున్నవారు. తండ్రివినీవు కావున నీక్షేమమునుఁగోరి నేనింతగఁబలుకుచున్నాను. చిన్నది బుద్ధిఁగఱపునదాయెనేయనెడి యభిమానంబుఁ బడలుము. నిజమెఱుంగుము.

దక్షుఁడు:—(కోపమునలేచి.]

మ॥ చెడుగా! చీఁపురుఁగట్ట చీ విడలుమా నేమంబునన్ మేనుతో
వెడఁగుంబల్కులుబల్కఁ లేని నిను నే వేధించి దండించెదన్

బడుగా బూడిదెపూఁతఁగాఁగలుగు నీభర్తన్వేగఁ జేరుమా
పడిపొమ్మా యెటనైన నీవిచట నిల్వంగ బోలదిబ్బందిగన్.

ఓసీ! దుష్టా! సిగ్గుమాలి పిలువబడనిదే నాదగ్గరకేలవచ్చితివి? పొమ్ము వెడలి పొమ్ము.

దాక్షాయణి:—దక్షా! విరూపాక్షుండఖిలారాధ్యతముఁడు. అత్యంతము నాక్షేపించువానికి నాశంబు సమీపంబుననుండును. నిరంజనుండును నిర్వికల్పుండును నిర్గుణుండును తత్వాతీతుండును, సర్వవేత్తయు సర్వవిద్యాధికుండును సర్వజ్ఞుండును బ్రహ్మాది దేవోత్తముండునగు మహామహుని మాహేశ్వరుని మోహినై తామసుని రీతిగఁదలంచి భవవిముక్తుండై ముక్తిఁగాంచు నభవుదూషించి దోషమేల కట్టి కొనెదవు? నీయట్టి పాపిసుతనై దాక్షాయణియను నామంబున నే బడయఁ జాల. కావున నీచేఁగల్పింపఁబడిన నాపాపిశరీరమును నేనిపుడే కాల్చివేసెద... ......భర్తవచనంబు ధిక్కరించిన భార్యకు శిక్షవి నవమానంబు తప్పదను సడి నేఁసార్థకపఱచితి.

సీ॥ విభవాతిశయముల విఱ్ఱవీఁగెడువాఁడు,
పుత్రినై భువి నేను బుట్టనేల?
పుట్టితిఁబో యేల పుట్టుదరిద్రుని,
సతిఁగాక లోకేశుసతిగ నైతి?
సతినైతిఁబో ప్రాణపతిమాటజవదాటి,
తల్లిదండ్రులఁగాంచఁ దలఁపనేల?
తలఁచినఁదప్పౌటే తలిదండ్రులీరీతి,
తనుజను నవమతిఁ గనిరదేల?

గీ॥ నాథునాజ్ఞదాటి నడిచినకతమున
నఘముఁజుట్టుకొని యె నవనినాకు
భవనిభర్తమాటఁ బూజింపనొల్లని

నాతిబ్రతుకువట్టి జోతబ్రదుకు.
కావున దాక్షాయణినై నే మనఁజోఁవ.

ఉ॥ భూరినిరామయాత్మకునిఁ బూజ్యుని నిత్యుని నిర్గుణున్ దయా
పూరితచిత్తునిన్, భుజగభూషణునిన్, భువనైక కర్తనున్
వారకనామదీక్షనిలిపి, వహ్నినిఁజొచ్చెద, భావిజన్మమం
దారయనీశ్వరుం బతిగనైనను బ్రోచునటంచు నమ్ముచున్.

(అందఱు హాహాకారములిడుచుండ దాక్షాయణి సనాగ్నినిఁ బడును.)

బృహస్పతి:—దక్షా! సవనమునకు నాదియందే యంతరాయంబు లనేకంబులాయెను. శుభకాలంబు మీఱెను. నేఁటికీకార్యంబు నిలిపి రేపుమరలఁ బ్రారంభింతము.

దక్షుఁడు:—ఆచార్యులవారూ! అటులనే కానిండు. ఎటులనైన నీ నిరీశ్వరయాగంబు నిరంతరాయంబుగ సలుపవలెను. ఇపుడు నిలుపుదము.

[నిష్క్రమణము.]

## తృతీయరంగము.

## కైలాసము.

ఈశ్వరుఁడు - నంది - నారదుఁడు - వీరభద్రుఁడు.

(ఈశ్వరుఁడు వరాసనమునఁ బీఠముపైఁ గూర్చుండియుండును. నందికేలు ఫాలమునఁగీలించి భయభక్తుల నిలిచియుండును.)

(నారదుని ప్రవేశము.)

నారద.—దితికులశిక్షా, శ్రితజనరక్షా, యతిబలదక్షా, శంకరా,
నుతసురనేతా, నతజనదాతా, యతికులత్రాతా, శంకరా,
రతిపతిరూపా, కృతహరికోపా, సతతకలాపా, శంకరా,
నతపరిపాలా, నుతగుణశీలా, హితపరిపాలా, శంకరా.

(సాష్టాంగవందనంబులు సలిపి.)

శంభోమహాదేవ, శంభోమహాదేవ, శంభోమహాదేవ, గంగాధర
మృత్యుంజయాపాహి, మృత్యుంజయాపాహి, మృత్యుంజయాపాహి,
మృత్యుంజయా
ఆకాశకేశామరాదీశ వంద్య త్రిలోకేశ్వరాపాహి, మృత్యుంజయా
ఊహాపథాతీత, మాహానంయుక్త, మోహాంతకాపాహి, మృత్యుంజయా
గంధేభచర్మాంగ, సక్తాంగసంసార, సింధుప్లవాపాహి మృత్యుంజయా.

(శంకరాచార్యుల వారివి.)

( ప్రణామంబాచరించును. )

ఈశ్వరుఁడు:--కం॥ నారద, జ్ఞానవిశారద,
కారణమదియేమొ నీవు కైలాసంబుఁ
జేరితివి, నీదురాకకు
భూరికతంబుండునొకటి, పూర్తిగఁ జెపుమా.

నారదా! నీ రాకకెద్దియో యొకవిశేషంబున్నది. అదిఁయేమి?

నారద:—మృత్యుంజయా! జగత్పాలన దక్షుండవు. కాలకాలుండవు. మహాదేవుండవు. కృపానముద్రుఁడవు. దీనవత్సలుండవు. విశ్వనేతవు విశ్వవ్యాపకుఁడవు. విశ్వాత్మకుఁడవు. ఇట్టి నీవెఱుంగనివార్త ప్రపంచంబుననుండు నా నటనకై యడుగనగునే గదవు?

ఈశ్వరుఁడు:—నారదా! అటుకాదు. నేను దాక్షాయణీ వియోగంబున నాలోచనాధీనమానసుఁడనై యుంటిని. కావున నేనెద్దియు నెఱుంగనైతిని, నారదా! నీ విప్పుడెచటనుండి వచ్చితివి.

నారద:—దేవా! దక్షుని యాగశాలనుండి.

ఈశ్వర:--యాగము సాంగోపాంగముగ జరిగినదియా?

నారద:—అదినే వాంపపాదముపడినది.

ఈశ్వర:--కారణంబేమి?

నారద:—తపఃశ్రేష్ఠుఁడగు దధీచియాక్షేపణ.

ఈశ్వర:--ఆక్షేపించుటకుఁ గారణమేమి?

నారద:—దేవా! మీ మామ దక్షుఁడు నిరీశ్వరయాగంబుసేయ సముద్యుక్తుఁడయ్యెను. దధీచి యాక్షేపించెను. దక్షుఁడు మిమ్మనేకవిధముల దూషించెను. ఆ దూషణ వినఁజాలక దధీచి లేచిపోయెను.

ఈశ్వర:--పిదపనేమి జరిగెను?

నారద:—పిదపజరిగినవార్త యఘోరకరముగనున్నది.

ఈశ్వర:--నారదా! ఎటులయిననుండని. దాచియుంచక తెలుపుము.

నారద:— దేవా! దధీచి యాటులనుదూషణ వినలేక లేచి వెళ్లిపోయినపిదప దాక్షాయణీ మహాదేవి ప్రవేశించెను.

ఈశ్వర:--వచ్చినపిదప.

నారద:—ఆలోకమాత నచటనెవరును గౌరవింపలేదు. కన్నతల్లి కన్నెత్తిచూడలేదు. అక్కచెల్లెండ్రొక్కరుమాటయిన నాడక దూరమరిగిరి. పిదపఁ యజ్ఞవాటికి ప్రవేశించెను. కన్నతండ్రి దక్షుఁడు మిన్నకయుండెను. దాక్షాయణి వేసరి దక్షునాక్షేపించెను. దక్షుఁడు మరల మిమ్మనేకవిధముల దూషింపసాగెను. ఆదూషణంబుకు దాక్షాయణి సమాధానంబులు నుడివెను. దక్షుఁడవివేకయున్నావచ దూషణలకుఁ బ్రారంభించ దాక్షాయణి యానిందలువినఁజాలక............

ఈశ్వర:--ఏమాయెను?

నారద:—మహేశ్వరా! ఆమాటనేను నోటనుడువఁజాలను.

ఈశ్వర:--నారదా! అదియేమి తెలుపుము వైళమ్మె తెలుపుము.

నారద.—భూతేశా! ఏమనితెలుపుదును.

ఉ॥ ఏమనితెల్పనౌను జగదీశ్వర యచ్చటివార్త ఘోరమౌ
తామసవృత్తినాఖలుఁడు దక్షుఁడు, హేయముగాను మిమ్ము - నే

వీరభ:—తండ్రీ! యాజ్ఞయిచ్చినఁ బోయివచ్చెద.

ఈశ్వర:—పోయిరమ్ము. (వీరభద్రుని నిష్క్రమణము.)

దాక్షాయణీ వియోగమ్మె నేను చిరకాలంబు సైఁపఁజాలను. నేనును హిమశైలంబునకు దపంబాచరించెద.

(నిష్క్రమణము.)

## చతుర్థ రంగము.

### దక్షుని యజ్ఞశాల.

దా - బ్రహ్మ - నారద - బృహస్పతి - ఉద్యానుఁడు - వీరభద్రుఁడు.

వీరభ:—ఉ॥ పరాత్పరుఁ నిరంజనుఁ నఖిలు, భావమందు నెవ్వరేఁ
నిరాకరించెఁ బాపి యెవఁడు, నీతిహీనుఁడగుచు, నా
దురాశయుఁ దురాత్ముఁ డిపుడు, ద్రుంచి వైచెద వైరి మే
నిరీశ యాగమనా నెసలుప, నీభవ్యత్తిఁ జూపుచుఁ.

(అనుచు గంభీరధ్వని సేయును.)

బృహ:—దక్షా! వేదులు మనము సవనమారంభించినది త్వాష్ట్ర కాలమని తోఁచెడు.

దక్షుఁడు:—ఆచార్యులవారూ! మీరు భయపడక కార్యము సలుపుఁడి. (వీరభద్రుఁ జూచి)

వీరభ:—ఓరీ! పోగుకుపోతా! నేనెవఁడని నిర్లక్ష్యముగ నడిగెదవా?

కం॥ త్ర్యక్షుని సుతుండను భీముఁడను
నక్షరుఁ బ్రణవాధికారు నాజ్ఞకులోనై
శిక్షింపఁగ వచ్చితి నిను
దక్షా తెలిసితివె నాయుదంతం బెల్లన్.

దక్షుఁడు:—(బృహస్పతిఁ జూచి) ఆచార్యులవారూ! ఆ తామసుఁడు పముఖలిఁ గెడవ నిట్టిబృహద్ఘటములఁ బిశాచములఁ బంపుచున్న వాఁడు. ఇట్టివారిని లక్ష్యపెట్టక మీరు కార్యము సలుపుఁడి.

బృహస్పతి:—(స్వగ) ఈదిక్కు నీర్వామి. ఆదిక్కు కొండగొయ్య. నాకు సంకటము వచ్చె. (దక్షునిఁ జూచి) మంచిదండీ. ఆదపునము సేయుఁడి.

వీరభ:—[రథసముగంబోయి యా చమసపాత్రను బాలుదైచి బృహస్పతినిం బట్టి యీడ్చును.]

బృహ:—దక్షా! ఈ భూత మాపేశమైనతోడనె సంకల్పమునకు వికల్పమువచ్చి, నేను వెడలవలసివచ్చెను. నామెడ నొక్కిపట్టెను నేనుండఁజాల. వెడవెడ.

వీరభ:—ఓరీబృహస్పతీ! ఇది వ్యాకరణము కాదు! వ్యాకీర్ణము! నిలువుమిచట. (దక్షునిఁజూచి) ఓరీ! దక్షా! క్రతువునవహవిర్భాగంబు హరునకునర్పించెదవా? యర్పింపవా?

దక్షు:—ఓరీ! పిశాచమా!

ఉ॥ తామసవృత్తిఁబూని భువిఁదారుచు భూతగణాధిపత్యముం
నేమముగానుసల్పునవినీతుని నీశు స్మశానవాసునిం
నేమముగాభజింతునెటుసిగ్గతి! శ్రీశవిరించులుండఁగా
యేమివిచారమిద్ది, వడి నేగుమువచ్చినదారిఁబట్టుచుం,

ఏమిటిమాటలివి? పిశాచాధీశుఁడై స్మశానాధికారంబు సలుపుచు నిత్యదరిద్రుఁడగు భిక్షుకునిమాట యిట్టిశుభకర్మంబునందెత్తకు. ఇచటనీవు నిలువకు. వచ్చినదారిఁబట్టుకొనిపొమ్ము. నీయాటలు నాసరసనెల్లవు.

వీరభ:—ఓరీ! పొగరుపోతా! విచ్చలవిడి మాటలాడకు. హెచ్చరిక. (హరి విరించిసురేశులఁజూచి) హరి విరించిసురేశులారా! ఈ గర్వాంధుఁడు దక్షుఁడాడు ప్రల్లదంబులు మీరువినియును సహించి నిలిచినారుగదా! మీకవమానము లేదా?

హరి:—(విరించి సురేశులఁజూచి) ధాతా! ఇంద్రా! మనకేల యీన్యాయనిష్ఠురము. రండి పోదము. ఎవరెటుపోయిన మాకువచ్చునదేమి?

వీర:—(వారినెల్లరంబిగపట్టి) ఓరీ! దక్షా! ఈశ్వరాంశంబగు హవిరంశంబు నీశునకిచ్చెదవా? ఈశ్వరుని ధిక్కరించెదవా?

దక్షు:—ఓరీమదాంధా! నేనీయను. ఆ నీదునిపేరు నే నుచ్చరింపను.

వీర:—(రూక్షేక్షణములఁగనుచు) ఓరీగర్వాంధా! ఈక్రతుధ్వంసంబొనర్చి నీమస్తకంబుఁ గత్తరించెద. (అనుచుఁ సవనవస్తువులెల్లఁ జెల్లాచెదురుగఁ బాఱవైచి దక్షుని మస్తకముద్రుంప నేలఁగెడపును.)

(అపనికపడును.)

(నిష్క్రమును.)

శ్రీ

# గిరిజాకల్యాణ నాటకము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

అ ర ణ్య ము.

ఇంద్ర - అగ్ని - యమ - నైరృతి - వరుణ - వాయవ్య - కుబేర - బృహస్పతి.

అ ను బం ధ ము 12.

ఇంద్రుఁడు:—దిక్పాలవరులారా! మనయాచార్యులవారు విధాతవద్దికిఁ బోయివచ్చిన పనియేమయినది విచారించెద. ఆ క్రూర తారకాసురాదులెటుఁ జూచిన నచట నగపడుచుందురు. మనకార్యాలోచన వారువినిరేని మముఁ బట్టుకొనిపోయి కారాగృహబద్ధులఁ జేయుదురు. వారిదౌష్ట్యము బలమాయెను. దానవశత్రులన్వదలి యెన్నిదినంబులీ యరణ్యవాసము సేయనోపుదము. కావున మీరు నలుదిక్కులు గావలియుండి రాక్షసులెవరయినను వచ్చినచో నాకుఁ దెలుపుఁడి.

(దిక్పాలకులెల్ల నెల్లదిక్కులఁ గావలియుందురు.)

ఆచార్యులవారూ! విధాతవద్దికిఁ బోయియుంటిరికదా? ఏమిజరిగెను.

బృహస్పతి:—అమరేశా! ఆ క్రూర రాత్రించరుల నాశనము, తనవలనఁ గాదనియును రమాధవునివల్లను గాఁబోలదనియును శివతేజంబొకటితప్ప మిగతవారిమండి యారాత్రించరులు దుస్సాధ్యులనియును బలికెను.

ఇంద్రు:—అట్లైన మనకీదురరణ్యవాసంబే గతియాయెను.

బృహ:—అటుకానటుల నొకయుపాయంబు ధాతమనకు దారిగఁజూపినాడు.

ఇంద్రు:—అచార్యులవారూ! అదియేమి?

బృహ:—ఈశ్వరుని తేజంబుద్భవింపఁ జేయవలెను.

ఇంద్రు:—అదియెటు సమకూడును. మనయవివేకములన దాక్షాయణి చిచ్చుఁజొచ్చెను. మహేశ్వరుఁడు మనపైఁగినిసి కాఁబోలు ఘోరతపంబొనర్చుచు హిమశైలంబుఁజేరెను.

మన్మథా! ఆ, తారకాసురుఁ డెప్పుడువచ్చి పైఁబడునోయని, మహేశ్వరబ్రహ్మ, నపుంసకమై
నది సార్థకముగ, మా మనములెల్ల నపుంసకములయ్యెను. ఎన్ని దినములిటులుండ
వలెను. ప్రకృతి పురుషసంయోగంబు లేమి సృష్టి నిలిచిపోవునుగదా?

మన్మథుఁడు:—అమరేశా! సృష్టికార్యంబు నిలిచిపోవుననియా నీభయము.

ఇంద్రుఁడు:—నెచ్చెలీ.

సీ॥ అతను శాపమ్మున నతను కేళిని ధాత
సుతఁ జేరఁ గాదె సమ్మతమటంచు?
యతినియతిని నున్న యతులెల్ల ధృతి నీకి
రతికై నమూహితీ సతిని గనరె?
పతిహితప్రతబృంద సతిహితబహు చౌర్య
హితవృత్తిహరిహరాచ రతులఁ గాదె
హలతపహుఁ డప్పతి సతులతో రతికేళి
మతిని గోరుచుఁ గాదె ప్రతముసలిపె?

గీ॥ అతిశయము లేల సేనహల్యాను గలిని
సితకరుఁడు ద్రోహియై గురుసతిని గలిని
మతిని బూనినదెల్ల నీమహిత బాణ
హతులగుచుఁ గాదె నెచ్చెలీ! హితముఁ గనుము.

మన్మథుఁడు:—ఇంద్రా! పిలిపించిన కార్యంబొకటి తెల్పక మిగతవార్తలెన్నియో తెలిపె
దవ్వి? నాయెదుటనా నీకీసంకోచము.

చం॥ పరమపతివ్రతామణుల బాధలఁ బెట్టుచుఁ బట్టితెమ్మనన్
త్వరితముగాను దెచ్చెదను తాపసులెవ్వరుఁ గాని నీపదం
బరసితపంబు సల్ప వడినా తతపుష్పశరాళి వారినిన్
గురుతర మోహవారిధినిఁ గ్రుంగఁగఁ జేసెదనమ్ము మామవిన్.

నెచ్చెలీ! నీకీసంకోచమువలదు. ఉన్నవార్తఁదెలుపుము.

ఇంద్రుఁడు:—మిత్రమా! నేవచ్చినమిత్రులు వారిరువురుగలరు. వారుసదా ననుఁగాపాడుచుందురు.

మన్మథుఁడు:—వారెవరు?

ఇంద్రుఁడు:—అతికఠినతపమొంచి, కఠినాత్ములగు రాత్రించరుల ఖండింప శక్తిగలిగి రాణించుతెగల నాకరభూషణముగనుండు వజ్రమొకటి అతికోమలతఁబూను లతాయుధములచే యతివరుల మానసంబులుజీల్చి నాపదవికిఁజ్యుతిఁ గలుగనట్టులఁ గాపాడువాఁడు నీ వొకఁడు. మీ యిరువురు మిత్రులనుండికదా నేను సకలభోగముల నిక్కుచున్నాను.

మన్మథుఁడు:—ఇంద్రా! ఈమాటలువలదు. కర్తవ్యకార్యంబుఁ దెలుపుమని నేనెన్నివిధముల నిన్నడిగినను మరల నీ యుపచారపుమాటల నాకువిసుగుపుట్టించెదవేల?

ఇంద్రుఁడు:—మన్మథా! ఉన్న యథార్థంబు నీకుఁదెలుపక మఱియెవరికిఁ దెలుపఁగలను? నెచ్చెలీ! సకలదిక్పాలురకీ వనవాసంబు తప్పనిదాయెఁగా? సమాధిచేరినను శని వదలదనినరీతి, వనవాసము సేయుచున్నను తారకాసురుని బాధ వీక్కటిక్కెను. ఏకాలంబునవచ్చి యేదండన విధించునోయని నోట నువ్వగింజలు వేసికొని నవారింబలేఁ బడియున్నవారము.

మన్మ:—మిత్రమా! ఈ యాపదఁదొలఁగించు నుపాయంబెద్దియును లేదా?

ఇంద్రు:—మదనా! మనయాచార్యులవారు నిన్నటి దినంబున బ్రహ్మలోకమునకుఁ బోయి బ్రహ్మతోనాలోచింప, హరునితేజంబుఁగాల్చిన మూర్తియే యా దానవుల ప్రాణంబులపహరింప నోపునని పలికెనఁట.

మన్మ:—మిత్రమా! కైలాసంబునకుఁజని హరునిఁబ్రార్థించిన మేలగునుగదా?

ఇంద్రు:—పంచబాణా! మున్ను, దుష్కృతిచే దాక్షాయణి దక్షునియజ్ఞాగ్నిలోఁ బడికాలెను. తద్వియోగంబున నీశ్వరుఁడు నిర్వికల్పుఁడై హిమాచల శిఖరమునఁ దపంబున్నవాఁడు. దాక్షాయణి పర్వతరాజపుత్రియై పార్వతినామంబున నీశ్వరుని వరునిఁగోరి యతనిని ధ్యానించుచుఁ దపంబుఁ జేయుచున్నది. వారిరువురి సంయోగంబునఁగదా హరుతేజంబుద్భవించును?

మన్మ:—ఇంకను నేఁజేయఁదగిన పనియేమియున్నది?

ఇంద్ర:—మిత్రమా! దానిని నన్నడుగవలెనా?

కం॥ గురుతరసుమబాణంబుల
హరుధైర్యముఁగల్చి వేడ్క హైమవతిసతిఁ గా
బరిణయమగునటు సేయుము
సుర బాధలడంచి భూరిశుభములనిమ్మా.

మిత్రమా! నగరాజనై దాఘనితాంత తాపమూర్చ మేఘానర్గళ ధారావళికిఁ గలశక్తి గండూపతోయంబునకుఁ గలుగునా? ధీరులమనస్తాపంబార్ప మహాసుమనసాయకంబోపునుగాని తదితరులకు సాధ్యమా! ఆ హరునిఁ దపంబార్ప స్మరుఁడవగు నీవోపుదువు. ఇతరులవశముగాదు. విషమాంబకుఁడతఁడు. నీవును విషమాంబకుఁడవు. కావున నీవిది దేవతాకార్యంబని తలంచి, యెటులనైన నాహరునిఁ జపలచిత్తునిఁ జేయుము.

మన్మధుఁడు:---మిత్రమా! ఆ జగజ్జనకుని, సంప్రార్ణానుగ్రహునఁగదా, నేను సమస్త జగములు జయించుచున్నాను. నేనతనికి స్వామిద్రోహినగుదునేని, నగ్గియుందు గుగ్గిలముభంగి, నేత్రానలంబునను భస్మంబుసేయఁడా? ఆ పంచవదనునిపై, నా సుమబాణ పంచకంబు సాగునా? ఏల నాకుఁ గర్ణకుమంత్రముపదేశింపఁ జూచెదవు? తారకాసురుని బాధలకు వెఱచికదా నీవు హరునిఁజెనకుమని నాకు బోధించెదవు? ఆ యీసునఁడే యెల్లకాలంబు ముదితలవలలోఁజిక్కి మోహపరవశుఁడై పంచాయుధప్రపంచంబున మునిఁగి యితరప్రపంచంబు మఱచులా గొనరించెద.

ఇంద్రుఁడు:---నెచ్చెలీ! దేవకార్యంబు సేయనోపననుట సమంజసముగాదు. లోకోపకారికవ్యాపారమునమున్న నేకులు తమశరీరంబైన నరకసేయక త్యజింపరే? వారు కీర్తిశరీరులై ప్రసిద్ధికెక్కరా?

సీ॥ కులిశముఁగోల్పోయి కోరదధీచి తా,
నిచ్చెనునాకువెన్నెముక, కాదె?

శి

పిశితంబుఁ గోరిన పిచ్చుక మొరవిని,

యిచ్చెను శిబి మేని యొరసు కాదె?

కవచకుండలములఁ గాంక్షింప నాకవి,

యిచ్చెను కర్ణుఁడు, మెచ్చుఁగాదె?

వటువయి కుటిలత వామనుఁ డడిగిన,

యిచ్చెను బలి రాజ్య మెల్లఁగాదె?

గీ॥ త్రిజగరక్షణమునకునై తెగువఁబూని
కాయమునునైన నిచ్చిరి కాదె ఘనులు
కాన నీవును దేవతా కార్యకర్త
వగుచు, సుమబాణ! రక్షింపుమయ్య మమ్ము.

మన్మథా! ఇది నీకు తప్పనిపని. నాకుఁగాను జేయవలెను. చేయక తప్పదు. నీ చేతులు బట్టికొని వేఁడికొనెదను.

మన్మథుః---[స్వగత] ఇంతటి దేవేంద్రుఁడు వేఁడికొనుచుండఁ దిరస్కరించుట ఘనత కాదు. నాకీపని యొనర్చుటచేఁ గలుగు నష్టమెద్ది? ఆ పరమాత్ముఁడు నన్ను భస్మంబు సేయునని కదా? జగత్కర్తచేఁ జచ్చుటకంటెను పుణ్యగతి వేఱొకటి కలదా? ఇప్పుడిట్లొనర్చెద. [ఇంద్రునిఁ జూచి ప్రకాశముగ.]

ఉ॥ శైత్యము దిక్కుండునను యికను నిర్జరవల్లభ! నీకుఁగాను నే
నస్మహనీయుని హరుని యాతతనిష్ఠ నడంచి లోకముల్
సమ్ముదమందఁ జేయుదును, శర్వుఁడు మా సతిఁగూడంగా వివా,
హమ్మొనర్తు, నేనిపుడె హైమనగంబును జేరఁబోయెదన్.

మిత్రమా! సెలవిచ్చిన నేఁబోయి హైమనగంబుఁ జేరి కార్యంబు సాధించుకొని వచ్చెద.

## అనుబంధము 14.

ఇంద్రుఁడు:---నెచ్చెలీ; ఇదికదా సుహృద్భావము. రమ్ము పోవుదము.

[నిష్క్రమణము]

## తృతీయరంగము.

### రతి - మన్మథుఁడు.

రతి:- చం॥ అమరవరుండ దేఁనొకో యజ్గజునిఁ బిలిపించె వేఁగ; నా
రమణుఁడు పోయెనంతట నె; రాదు వియోగము సైఁపనాకయో
భ్రమరము పుష్పసారమలి భవ్యముగాఁ గొను రీతిఁ, బ్రీతి నిం
సుమశరుఁడల్ల నాకధర చుంబన సౌఖ్యము నెన్నఁ డిచ్చునో.

అయ్యో! మోహనాంగుఁడు పోయి నాలుగు దినములాయెఁగదా? ఈ నాల్గు దినములు నాకు నాలుగు బ్రహ్మకల్పములాయెను. నారమణుని వియోగ మింకనెయి తైనను సైఁచనోపని నేనిన్ని దినములు మనియుంట, నతఁడప్పుడే యిప్పుడే వచ్చుననెడి యాశతో నేగదా? ఆ, యాశాలతాంతము నైనను వాఁడు నొచ్చెను. ఎప్పుడు వచ్చువో? శబ్దార్థంబులరీతిఁ బుష్పామోదములగతిఁ బరస్పరానురాగబద్ధుల మై, వియోగ విచారం బెట్టిదయో యని తెలియకయుంటిమి కదా? నాపాలిటి మందగ్రహముగ నా యమరేశుం డేల యున్నవాఁడో?.........నాపలికాక యాలసింపనేల.

## అనుబంధము 15.

నిశ్చలమతులగు యతులతపోభంగ మొనర్ప నిర్జరేంద్రుఁడు నా రమణుని నియోగించియుండునా? ఉండును. రాత్రించరులంబోలెఁ దివంబులపాలి మృత్యువుగదా యింద్రుఁడు? తప మొనర్చువారినిఁ జూచినఁ దనవిభవమెల్లఁ గొల్లఁగొట్టుకొని పోవువారింబలెఁ జూచును.......అటులయుండునా? కాదేని స్వర్గముననున్న సురస్త్రీలు నా మోహనాంగుని ముద్దుమోముఁ జూచి, మోహించి మరులుగొని తైఁబడి, తమవలలలో వేసికొనిరో? ఇటులుండునా? ఏమియుఁ దెలియకయున్నది. ఏమియుఁ దోఁపకయున్నది. ఏమిసేయుదు? అధమురాలను నేను. ఎవ్వరిచ్చె హెచ్చు నేనేమి సేయఁగలను? మంగళాంగా, కృపఁ దప్పనేని వానిఁ బట్టికొని యెన్నఁడేకా దిటునియుఁడుట కాంకలకు సాధ్యమా?

కం॥ వెలిచవిమరగిన పురుషులఁ
గులకామినులాఁక పెట్టఁగోరఁగరారే?
తలవ్రాఁతయొ తమదుష్కృత
ఫలమనుచునో; మనముఁగట్టిపరచుకొనవలెఁ.

నే నేమిసేయఁగలను? ( ఆలోచించుచు దీనవదనయై కూర్చుండియుండును. )

( మన్మథుని ప్రవేశము. )

అనుబంధము 16.

మన్మథుఁడు:—(స్వగ) ఏమిది! నామోహనాంగి, రతి, యాలోచనాధీనమానసయై, చింతించుచు, నేనువచ్చినను నన్నుఁజూడక కూర్చున్నది? నేను తన్నువదలి చాలాకాలము పోయితినని కోపమూనినదికాఁబోలు? మంచిది సమీపించి పల్కరించెద. ( ప్రకాశముగ ) ప్రాణప్రియా! మోహనాంగీ! ఏమిదియచ్చెరువు నేను సరసఁజేరినను బల్కరింపవు? ( రతి మోముద్రిప్పుకొని కూర్చుండును ) ప్రాణేశ్వరీ! ఏమి, మోమటుద్రిప్పితివి? నిన్నువదలి పెద్దకాలము అవసితినని కోపమా? నీవు మానమూనుట నాప్రాణము పోవుటయేకదా! మోము నాదిక్కు మరల్పుము. ( అనుచు మోముఁబట్టుకొనిత్రిప్ప, రతి మరల ముఖముప్రక్కకుఁ ద్రిప్పికొనును ) జీవితేశ్వరీ! ఇంతగఁ గినియఁ గారణంబేమి? ఇఁక నీమానమునకు సెలవిమ్ము. ఒకమాటాడుముచాలు.

రతి:—పొమ్ము.

మన్మ:—ప్రాణమా! పొమ్మనుటయొకమాటయా! మఱియొక ముద్దుపల్కు పల్కుము. మానసామోదముఁగల్పింపుము. నిన్ను వేఁడికొనియెద.

రతి:—వెడలుము.

మన్మ:—మోహనాంగీ! “పొమ్ము. వెడలుము” అనునవి ముద్దుమాటలా? వలదీకినుక! రెండుమాటలాడి నాకు ముదంబుఁగూర్పుము. బతిమాలెద.

రతి:—ఇచ్చట నిల్వకుము.

మన్మ:—ప్రాణప్రియా! నేఁగోరినరీతి రెండుమాటలాడితివికాని నామానసంబునకు

మువంబోనఁగూర్పవైతివి. నాపైననా నీకింతకోపము? నే, నీకేయపరాధంబు సేయను. ఒకవేళ నా యొనర్చినది తప్పని నీకుఁదోఁచియుండెనేని యిదిగో, నీనునుపదములపై నాకత్తినోత్తమాంగంబుఁ జేర్ప సిద్ధుఁడుగనున్నాను. (కాలు బట్టుకొనును.)

నాతీ! నీసుమనమ కోమలపదము నాకఠినదేహమంటి నొప్పిబట్టెనెమో.

కం॥ సుమసమ మగునీపదములు
రమణీనాకరకుమేను రాచినకతనన్
శ్రమమందెనెమొ యోతైద
క్షమియింపుమునన్ను కాంతరోగనుమ.

రతి:—స్వర్గమున సురస్త్రీలున్నవారు. వారి పాదములమీఁదఁబడుము. నీకు మూటకట్టి తలపైనెత్తుదురు! నాపదములపైఁబడ నేలయత్నించెదవు? నేను నిర్భాగ్యను. నీకేమివ్వఁగలను?

అ ను బ ం ధ ము 17.

మన్మ:—హా! హా! ఇదియా నీ కోపమునకుఁ గారణము? చెలీ! ఆ స్వర్గస్త్రీలు నీకాలుగోరైనను బోలఁగలరా! నీ సౌందర్య లావణ్య తారుణ్య హావ భావ విలాస విభ్రమములుఁజూచిన నాకన్ను గవ యా యువిమిహాంగలఁ జూడఁ గోరునా?

సీ॥ శశిరేఖయుంటమా, శశిరేఖనీరుచి
ఫాలతలంబైనఁ బోలలేదు
హరిణీసరోజాక్షియుండమా హరిణి నీ
కనుఁగవకాంతియుఁగనఁగలేదు
రంభయుఁటుండమా, రంభ నీరంభోరు
సారకాంతికిని నీరూపలోన

తారయుం జందనమూ, తాన నీనునుగాలి
గోర్వైనఁబోలఁగఁ దారుమింట.

సీ॥ అలతిలోత్తమ నీనాసచెలువుఁబోల
గానుఁగనుఁజక్కి రాపిడిఁ గాంచుఁగనుమ
యచ్చరాంగనలంద మేమందమబల
సుధనువిడి, యెంతజడుఁడైన, సుర్దఁదిసునె?

వాణీ! నామాటలునమ్ముము. నేనట్టి తుచ్ఛసుఖములఁ గోరువాఁడను కాను. ఇదిగో నీ కెందుచెక్కుటద్దములపైఁ గేలిజి బాసఁజేసెద. అవిచాలదేని నీ యధరామృతము గ్రోలిబాసఁజేసెద. అదిచాలదేని నీపయోధరములంటి బాసఁజేసెద. అదియునుజాలదేని నీ పాదములంటి బాసఁజేసెద. (అనుచుఁ బాదములంటఁబోవును.)

రతి:—చాలు చాలు. నాపాదములంటకు. పూర్వజన్మమున నేనెన్ని పాపములొనరించితినో యిపుడు నేను నీ వియోగదుఃఖమనుభవించితిని. మరల నీచే బాదములంటించికొనిన పాపమునకుఁ బోఁగలనా? అంతటిధూర్తను గాను.

అ ను బం ధ ము 18.

"గతస్యశోచనానాస్తి" యనియున్నది. మదనా! ఆమనవరుఁడేల నిన్నుఁ బిలిపించెను?

మదన.—మోహనాంగీ! ఏమోయించుక కార్యమునుండి పిలిపించియుండెను.

రతి:—నాథా! ఇంచుక కార్యమునకు నీవిన్ని దినములు నిలువవలసివచ్చెనా? నే నమ్మను. అదియేమో మహాత్కారణమయియుండును. మిగతవిషయములబలెనే, నీవీ విషయంబునైతేను నానుండి దాఁచుచున్నావు.

మన్మ:—మోహనాంగీ! అటుకాదు. రహస్యకార్యాలోచన లొకచెఁబడినచో నది యేమిచిత్రమో లోకులెల్లవిందురు. కావున రహస్యంబు వెలివేయుట పురుషధర్మముకాదు.

రతి:—ప్రాణకాంతా! రహస్యమని పేరిడినతోడనే, దాసినిఁ దెలియునంతిపదకు మానుట స్త్రీధర్మముకాదు.

మన్మ:—ప్రాణప్రియా! ఈ విరుద్ధపక్షంబుల నెటు సమన్వయింపవలెను?

రతి:—నాథా! సమన్వయించు మార్గమొకటేను. ఏవరికిని దెలుపనటుల నాతో బాస చేయించి రహస్యంబు నాకుఁ దెలుపుట.

## అనుబంధము 19.

మన్మ:—మోహనాంగీ! ఆడువారినోట మాటనిలువదుగదా! నీటిలో నూనెఁబోలెఁ బైకుబుకుచుండును.

రతి:—ప్రాణేశ్వరా! అటుచేయను. పాతరలోని గింజలఁబోలె లోగానే దాఁచికొనియుండెదను.

మన్మ:—మానినీ! మాటకుమాట కెదుర్చనీవు జాణవని నాకుఁ దెలుసును.

రతి:—నాథా! నేను జాణనుగావుననే నాకుఁ దెలిపిన రహస్యము వెలివడదు.

మన్మ:—నీవునన్ను వదలవని నాకుఁ దెలుసును. ఆ రహస్యమును దెలిపెదను విను. త్రిజగంబులకును దారకాసురుని బాధ యుగ్గలంబైనదట.

రతి:—ఉండనగు! వానినుండి మనకే బాధయును లేదుకాదా!

మన్మ:—స్త్రీ విషయానుభవరక్తులగువారు మము బాధించినగతియేమి? వాని బాధల నివారింప, వారు తేజమోప్పరట.

రతి:—నిజము. ఆ జగత్కర్త తేజము సామాన్యమా?

మన్మ:—శంకరుఁడు దాక్షాయణీవియోగంబు సైఁపనోపక కైలాసంబునఁ దపంబు సేయుచున్నవాఁడట.

రతి:—ప్రాణప్రియా! వియోగంబు సత్పురుషుఁడోపునా? సర్వేశ్వరునివదలి లోకజనని యెచటికేఁబోయెను?

మన్మ:—తనతండ్రిదక్షుఁడు, నిరీశయాగంబొనర్చుచు, శివదూషణసేయుచుండ దాక్షాయణి తనపతి నిందసైఁపఁజాలక పవనాగ్నిలోఁ బడిపోయెనట.

రతి:—అయ్యో! ఆ సర్వమంగళకు నెంతవిపత్తు సంభవిల్లెను.

మన్మథ:—దాక్షాయణి పర్వతరాజపుత్రియై పార్వతీనామంబునఁ బ్రసిద్ధిఁగని పరమేశ్వరుఁడే తనపతి కావలెనని, తపంబు సేయుచున్నదఁట.

రతి:—ఉత్తమస్త్రీ లక్షణమదియకదా!

మన్మ:— నేఁబోయి జగదీశుని, నిశ్చలయోగంబుమాన్పి, పార్వతీ సంయోగంబునకు మార్గంబుసేయవలెనని యమరేశుఁడు వేఁడికొనెను.

రతి:—ఏమీ! నిటిలాక్షుని పటుతపంబున కంతరాయంబుఁ గల్పింపవలెనా! అదిసాధ్యమా! దానికిబదులేమిఁబలికితిరి.

మన్మ:—ప్రారంభమున నే నియ్యకొననైతిని. విబుధేశుని వేఁడికోలు బలమాయెను. దేవేంద్రుని చెలిమికి విరుద్ధమగునని యెట్టకేలకు నేనియ్యకొంటిని.

రతి:—ఏమీ! ఏమీ! ప్రాణేశా! ఏమిపలికితివి? సర్వేశ్వరు నెదిరింపఁదలఁచితివియా అగ్గిలోదుముకఁ యత్నించితివియా? సింహమువేటఁ బూనితివియా? సంద్రిపై విరుద్ధమెంచితివియా?

మన్మ:—మోహనాంగీ! ఏమిసేయుదును? బలారిబలవంతపెట్టెను.

రతి:—ఆ, బలారి, మనములోనె, నీపైఁజలము సాధింపుచున్నవాఁడు. నీవు స్వర్గమునకుఁ బోయినపు డచటి సుందరాంగులు తన్నుఁజూడక అనిమిషులై నిన్నే జూచుచుండురనెడి యసూయత నాయమరేశుని దేహమెల్ల నిండినది. ఎల్లకాలము నీ యంత్యమతఁడు గోరుచుండును. అతనిమాటలు సరకుసేయకు.

మన్మథుఁ:—నాతీ! అటుకాదు. ఇది దేవతాకార్యము. సర్వలోకోపకారమగు కార్యము, కావున నే నాలోచించి సమ్మతించితిని.

రతి:—నాథా! నీవేమి యెంతగ నాలోచించినను సిద్ధాంతీకరించిన ఫలితార్థమేమో చెడుగు. పరమేశ్వరునిపై నీవుఱుకుట శిఖిశిఖలపై మిడుతయుఱుకుట కాదే? నాథావలదు. ఇకార్యంబువలదు.

మన్మ:—నాతీ! నేను మాటతప్పుటకురాదు.

రతి:—నాథా! సర్వజ్ఞుఁడును సర్వకర్తయు సర్వగురుండునునగు శర్వుని నీవుగర్వమున శరవ్యుఁజేయఁ బ్రమాదంబగును. నమ్ముము.

మన్మ:—సతీ! నేవలదనిన, దేవతలు నను శపింతురు.

రతి:—నాథా! సురశాపంబున కవధికలదు. శివశాపంబునకవధి లేదు. అదియమోఘంబు.

మన్మ:-- రతీ! శాపతప్తుఁడనై నేఁబ్రదుకఁజాలను. సతీపతుల సంయోగకారకుఁ డనుటకుఁగదా నే జన్మమెత్తినది.

రతి:---నాథా! నీశక్తి లోకసామాన్యులందు ఫలించునుగాని జగజ్జనకునియెడ ఫలించునా? ప్రాణేశ్వరా! బలాబలంబుల తారతమ్యంబైనను నీవు చక్కఁగ నాలోచింపవేల? అతనికిని నీకును హస్తిమశకాంతరంబుగదా!

సీ॥ అతని శరాసన మచలరాజంబయె
విరితీగెడు చెఱకునీ విల్లుగాదె
అతని బాణము పాశుపతమయి రాజిల్లు
నంటినవాడు నీయాశుగంబు
అతఁడన్నఁ ద్రిపురాసురాంతకుండయ్యెను
విరహార్తజనతాపకరుఁడవీవు
అతఁడసమాంబకుఁడగుచును విలసిల్లుఁ
గుసుమాంబకుండవయి యెసఁగుదీవు

అతనికిని నీకు, గజమశకాంతరంబు
గలదు ప్రాణేశ, లేకుపఁగరళకంఠు
నెదురఁజూచెదు నీపట్టు, వదలుమింక
మిడుత, శిఖశిఖ లెదిరించి మ్రేలుగను నె.

ప్రాణనాథా! ఇందుశేఖరుని సంధటివలెనే గనుఁగొందువే. అతఁడనోసట కంటిమంటచే జగములుగాలునన్నఁ గుసుమకోమలుఁడవగు నీవు నిలుతువే? ఈశ్వర ధ్యానైకపరుల నొప్పింపనోపని నీశరము లీశ్వరుని బాధించునా? నీవిల్లునను మ్మి యింత టిపనికోపితి నందువో యది పిల్లఁతెని పాలవేయుచెఱకు. నీ శరములంటివో, తరుణుల కురులకు శరణనుపవి. నీ మూలబలమన్ననో, లలనలంటినఁ బలాయనమంత్రంబు పఠించునవి. కాకిపిల్లలకు నోడుపికములు నీ బంటులు. ఇఁకనీవో తెలుపుదునా?

మన్మ:--తెలుపుము. దానినేల దాఁచెదవు?

రతి:--నీ శక్తిరూపు, నెనింతుక యలిగిన, గడగడ వడఁకెదవు? ఇట్టివాఁడవా పరమేశ్వరు నెదిరించునది?

చం|| హరు నెదిరింపఁగాఁ గనక యానర కేసరి చర్మ మిచ్చె, శం
కరు నెదిరింపఁ జాలకను గంజభవుండు శిరంబు నిచ్చె, నీ
శ్వరుని జముం డెదిర్చెనె? నిజంబుగఁ బ్రాణము నిచ్చెఁగాక, నీ
గరువము మాని భూతపతిఁ గొల్వుము యిష్టఫలాభిసిద్ధికిన్.

మన్మ:--ప్రాణేశ్వరీ! నీవిఁకను నాబలం బెఱుంగకయున్నావు. ఈశ్వరుం డనన్యశమగు శక్తివంతుఁడనునది నాకుఁ దెలియును. నీకుఁ దెలియును. సర్వు లెఱుంగుదురు. నాసామర్థ్యము సర్వు లెఱుంగుటయు గాక యీశ్వరుండు సైతము మెఱుంగును. నాయసమానశక్తికి నోడికదా యొకానొకసమయంబునఁ దననారికి నర్ధశరీర మిచ్చి యర్ధనారీశ్వరుండయ్యెను. మఱియొక నారిని శిరముపైఁ గూర్చుండఁ బెట్టుకొని సంచరించుచున్నవాఁడు. వీనినిఁ జాలక దారుకవనముని నారులఁ గోరెను?

కం|| తెలియవె నా బల మబలా
జలజాసనుఁ డవరి సుతనుఁ జాయఁ గొనియెన్
బలభేది కోడియయ్యెను
జలజాక్షుఁడు జేర్చె నెదను జలజాలయనున్.

రతి:--ప్రాణేశ్వరా! అటుచేయుటకు నీశ్వరునకుఁ గారణాంతరములున్నవి. అది నీసామర్థ్యము కాదు.

మన్మ:--సతీ! నా సామర్థ్యంబున, సతి, నియతినిష్ఠానిన, యతులకఠినహృదయములు సైతము, చంద్రకిరణంబులఁ జంద్రకాంతోపలంబులు కరఁగినరీతిఁ గరఁగుచుండును. కామతత్త్వమహత్త్వంబు నీకిఁకను దెలియదు కాఁబోలు.

రతి:--నాథా! నాకన్నియుఁ దెలియును. అయినను నా త్రిభువనాధీశ్వరుని, సర్వేశ్వరుని, కాలారిని, ప్రళయాగ్ని రుద్రునిఁ జెనకుట చేటని నేఁ బతిమాలికొని తెలిపెద నాథా! బలవద్విరోధం బెట్టివారికిని దగదు.

సుశస్తంబుగా రాజిల్లెదేవ, త్రేతాగ్నులై భాసిలుఁగాదె నీనేత్రంబులె వేవేళ సప్తాంబుధుల్ సప్తధారాధరంబుల్ శివా, నీజటాపల్లిస్రగ్గావె, నారాయణా దుష్టశిక్షణా, శిష్టసంరక్షణా, పంచభూతాత్మకా, తత్వనిర్ణేతకా, నీవు తేజోమయుండైవె, విరాజిల్లి చైతన్యరూపంబునుఁ దాల్చి, బ్రహ్మాండజాలంబు నీరోమకంధంబున నెర్చి మందాకినీ సోదనీరంబుఁ ద్రావించి రక్షింపవా! సాంబ! నీశుద్ధబుద్ధిస్వరూపంబు వర్ణింపనా బుద్ధికిన్ సాధ్యమే, శంకరా? శాంకరీవల్లభా! దుర్లభా! దంతిదైత్యాంగ చర్మాంబరా! యీశ్వరా! పాహిమృత్యుంజయా! పాహికాలాంతకా! పాహిదీనావనా; పాహికైలాసవాసా! వినీతుండనై మ్రొక్కెదన్; ఘోరతాత్రించరోపద్రవంబున్ సహింపంగఁ గష్టంబయెన్ గాన దిక్పాలురెల్లన్ ననున్ గోరఁగా, నీ సమీపంబునుం జేరి నీదార్ఢ్యమున్ బాపఁగఁబూనితిన్ గాని గర్వంబునన్ గాదు, దేవా మహాదేవ, నే వేఁడెదన్ భక్తిచే మ్రొక్కెదన్ మ్రొక్కెదన్ మ్రొక్కెదన్.

( అనుచు నమస్కరించి. )

అ ను బం ధ ము 21.

ఏమిది! శంకరుఁడు స్తోత్రప్రియుఁడని వినియుంటిని. నేనెంత స్తుతించినను జలింపకయున్నవాఁడు. ఈ సర్వేశ్వరుని తపోభంగంబు సేయుమని నేఁబూనివాను. విను తిని వయసేయుఁడు. కావున భీతినిలొంగఁజేసెద. ఇదిగో నాయిందుకిల్లున నరవింద బాణంబు సంధించి మహాదేవుని మనోదార్ఢ్యంబగల్చెద.

( అనుచుఁ జెఱకువిల్లునకు నరవిందబాణంబు దగిల్చివేయ నీశ్వరుఁడు చలింపక యుండును. )

హా. హా. నాయరవిందశరము రిత్తపోయెను. ఈతూరి యశోకంబుప్రయోగించెద (అదియు రిత్తపోయెను) ఈతూరి చూతము ప్రయోగించెద (అదియు రిత్తపోవును) ఈతూరి నవమల్లిక నుపయోగించెద. (అదియు రిత్తపోవును) హా. హా. మహాదేవుని

మన్మ:—నాతీ! ఈ మాటలనుండి ప్రయోజనమ్ము లేదు. అమరవరులకు నేను మాట యిచ్చివచ్చినాను. ఆ మాటఁ ద్రిప్పుటకు హరిహరాదుల వశముగాదు. నీనుండి సెలవుపుచ్చుకొనిపో వచ్చినాఁడను. ఆలశ్యంబునకుఁ గాలంబు లేదు. నాకై నా నెచ్చెలివసంతుఁడును నా బలమెల్లను గాచియుండును. సెలవిచ్చినఁ బోయి వచ్చెద.

రతి:—నాథా! నీవియోగంబు సేసైపఁజాల. హా హా ఇదినాప్రాప్తి ప్రాణనాథా

ఉ॥ కొమ్మను నీవియోగమును, కుంపటినగ్నిని ద్రోయనౌనె? నే
నెమ్మెయిఁదాపమోపఁగల? నెద్దియుపాయము ప్రాణముంపఁగాఁ?
బోమ్మన నెల్లిదంబగును; పోవలదన్న ననిష్టకారియౌ,
నమ్మలిఁబోయిరమ్మనఁగసార్థకమౌ, మదనా; మనోధనా!

మన్మ:—ప్రాణనాయకీ! చింతింపకు. రమ్ము. శైఘ్ర్యమ్మె మరలి నినుఁగూడి సుఖంబుననుండెద. రమ్ము. మందిరమ్ములోనికిఁ బోవుదము.

అనుబంధము 20.

(నిష్క్రమము.)

## చతుర్థరంగము.

## హిమశైలము.

పరమేశ్వరుఁడు - మన్మథుఁడు.

(పరమేశ్వరుఁడు వటవృక్షంబుక్రింద దక్షిణామూర్తిరూపంబునఁ దపంబొనర్చుచుండును.)

మన్మథుఁడు:—(ప్రవేశించి యీశ్వరునకు నమస్కరించి కేలుమోడ్చికొనినిలిచి.)

దండకము ॥ శ్రీమన్మహేశా, నిరీశా, నిరాశా, నిహారావనీధృన్నివేశా, నిశాకాంత నీకాశదేహప్రకాశా, నిరీహామనోగేహసంవేశ, నిర్నాశ, నీరేజగర్భాండలోకావనీశా, దిగీశా, ననుఁ జూడుమాయీశ, ముల్లోకముల్ నీవు పుట్టింప రక్షింప గిట్టింపఁగాదా త్రిశూలంబు నీహ

యుండు నాశరము లెల్ల వమ్మయ్యెను. ఇఁక నీలోత్పలమొక్కటి నిలిచెను. అది యేమగునో? ప్రయోగించి చూచెద. (అనుచు నీలోత్పలంబుఁ బ్రయోగించును.)

ఈశ్వరు:—(నొసటికన్నుఁ దెఱచి రూక్షేక్షణమున వీక్షింప మన్మథుఁడు కాలును.)

(అవనిక పడును.)

(నిష్క్రాంతము.)

## పంచమాంకము.

### హిమశైలము.

ఈశ్వరుఁడు - రతి - మన్మథుఁడు - నారదుఁడు.

ఈశ్వరుఁడు సమాధియోగంబున నుండును.

రతి:—(ఏడ్చుచుఁ బ్రవేశించి మన్మథునిఁ జూచి)

అనుబంధము 22.

సీ॥ హా! యనదృశరూప! హా! భుజబలదర్ప!
హా! జగజ్జనదీప; హా ప్రతాప
హా! లోకమోహన! హా! జగజ్జీవన!
హా! శ్రితావన! యిపుడడఁగి తెచటు?
హా! దయార్ద్రితచిత్త! హా! దీనజనవిత్త!
హా! నాథ! నన్నిటులఁ డవిపాలు
సేసిపోయితె! నాదు చెలువంబు గానలోఁ
గాచిన వెన్నెల కరణియయ్యె?
గీ॥ నిన్ను విడనాడజడజాక్షి! నిక్కముగను
నమ్ముమనునుడి నేటికి వమ్మె నాథ!
నన్ను నక్కటటముంచితే నాదురమణ!
నీకుఁ గానట్టి యీ మేను నిలుపఁజాల.

హా! ప్రాణనాథా! నన్నిటు, లనాథనుసేయుదువని నేఁడెంపనైతి. ప్రాణేశ్వరా! బలవద్ద్వేషంబుఁ గూడదని పుల్లనిలించపలికితి. అంత్యకాలమున హితోపదేశము

గుణరహితుండయు గుణసహితుండయు
యానందరూపత నందె నెవఁడు
పురుషస్వరూపుఁడై బ్రహ్మమై, జ్యోతిస్వ
రూపత వెలసిన రుద్రుఁ డెవఁడు
చిదచిదానందమయుఁడయి చెలఁగె నెవఁడు
ఉపనిషద్వాక్యవేద్యుఁడై యుండు నెవఁడు
ప్రణవసింహాసనావరోహణుఁ డెవండు
అట్టిదేవుని భర్గుని నాశ్రయింతు.

( అనుడు నమస్కరించి రతినిఁ జూచి. )

(స్వగ) ఏమీ! ఈ పతివ్రత, రతిగనఁబడె... పల్కరించెద. (ప్రకా) పతివ్రతాశిఖామణీ నీ వెవరివు?

రతి:—జ్ఞానానంద స్వరూపా!

గీ॥ అవనిదుఃఖంబు లెన్నియో, యన్ని వీర
లనుభవింపఁగవలెనని యజుఁడుజనుల
ఫాలతలముల వ్రాసిన వారిలోన
నగ్రగణ్యను నేనయ్య యతివరేణ్య.

నార:—సతీ! ఏల యింతగ దుఃఖించుచున్నావు?

రతి:—నేను రతిని. నాపతి మన్మథుఁడితఁడు. అమరపతిమాటవిని, పశుపతినెదిరించి యాజగత్పతి ఫాలనయనానలమున శాహుతియయ్యెను. పతివియోగంబు సైపఁజాలక నేఁజితిఁజేరనుద్యుక్తనైతిని.

నార:—అయ్యో పిచ్చిదానా? చితిఁజేరిన నీకుఁగలుగులాభంబేమి? ఎటులనైన నీపతినిఁ బ్రతికించుకొనెడి యుపాయంబుఁ జూడవలెనుగాని.

రతి:—యతివరేణ్యా! వ్యసనాబ్ధిలోమునిఁగి దరిదాపుఁగానక నాకు దిక్కుదోఁపక యున్నది.

నార:—పురంధ్రీమణీ! ఈ సర్వేశ్వరుఁడీ పరమాత్మ. ఈ జగత్కర్త ఈ జగజ్జనకుఁడు

దీనజనమందారుఁడై కామితార్థంబు లిచ్చుచుండును. నీవాసర్వజ్ఞునిఁ బ్రార్థించి నీపలినిఁ బడయుము. చింతింపకు.

రతి:—ఆపద్బాంధవా! తమ యానతిరీతి దీనతజన కామితార్థదాతను చంద్రజటాజూటుని భక్తిచేఁ గొలుచుచుండెద.

నార:—సతీ! అటులొనరింపుము. నేఁబోయివచ్చెద.

(నారదుని నిష్క్రమణము.)

రతి:—(సమాధియోగంబుననున్న యీశ్వరునిఁజూచి కేలుమోడ్చికొనినిలిచి.)

అ ను బం ధ ము 24.

ఉ॥ దురితవిభంగ! శిష్టజనదుఃఖభుజంగపతంగ! యీశ్వరా!
శరధినిషంగ! నిశ్చలితసంయమిహృల్లసరసీజభృంగ! శాల,
కరిముదితాంతరంగ? నవనందితురంగ; దయాంతరంగ! యా
దరితజనానుషంగ! నిరతంబును భక్తినినీకుమ్రొక్కెదన్॥

(అనుచు నమస్కరించి)

సీ॥ శైలకన్యామనస్సారసాహస్కర
శరణుసంయమివర శరణుసాంబ
శైలరాజోత్తమ శరపీఠటంకార
శరణుసర్వేశ్వర శరణుదేవ
శైలధరాంచిత శరహతాసురపుర
శరణుశుభంకర శరణుశర్వ
శైలశాత్రవవైరి జాలకాలాకార
శరణుసర్పాహార శరణునిత్య

గీ॥ శరణుచంద్రార్ధజూట, పశ్యల్లలాట
కంఠగతకాలకూట, శ్రీకంఠ శరణు

శరణువ్యాళకిరీట, వాగ్వరకరోట

శంకరా! చంద్రశేఖర! శరణు! శరణు.

(పునః ప్రణామంబులాచరించి.)

పరమేశ్వరా! దుఃఖాబ్ధిలోఁబడి దరిఁగానక మునుగుచున్న నాపాలిటినావవై నీ శంకరనామంబు సార్థకపఱచికొనుము. సర్వవ్యాపకా! నాపతి నిరపరాధి. అతనినిఁ బ్రేరేచి సురలింతటిపని నొనర్చిరి. ఈ సారస్యమెఱింగి మాయనిఁబ్రదికించి సర్వజ్ఞుఁడను నీ బిరుదును స్థిరపఱచికొనుము. నిను వేఁడి నీపైనమములు జల్లిన నాభర్తను సంహరించిన నీకు రాజశేఖరనామంబెటు సిద్ధించునో యోజింపుము. పసిబాలుని నబలునిఁబడవైచినచో నీకచలధర్ముఁడని నామంబుసిద్ధించునా? దీనిని మదినెన్నుము. ఈశ్వరా! నీశరణంబుఁదప్ప వేఱుశరణంబు నేఁగాను. యాచించినపుడు లేదనిన, యాచకున కెంతటి దుఃఖమగునో నిత్యభిక్షకుఁడగు నీవెఱుంగుదువు. కావున దీననై పతిభిక్షనడిగితిని. నా యాశాభంగమొనర్పక నన్నురక్షింపుము.

ఈశ్వరు:—(నిష్ఠఁజాలించి రతినిఁజూచి) సతీ! నీవుపతివ్రతామణివి. నీపతి దేవతాకార్యంబు మఱిఁబూని గర్వమతిని నన్నెదిరించెను. ఊఱడిల్లుము. కొంతికాలంబునకు నీపతి నినుఁజేరును. పొమ్ము. (లేచి స్వగ) నాతపంబున కంతరాయంబులిచ్చోట ననేకములు గలిగెను. ఇచట నికనిలుచుటతగదు. నిర్జనప్రదేశంబుఁ జేరెద.

(అవనికపడును.)

(నిష్క్రమము.)

శ్రీ

# గిరిజాకల్యాణ నాటకము.

చతుర్థాఙ్కము - ప్రథమరంగము.

మేనక - మూడేండ్లపార్వతి - జయ - విజయ.

మేనక:—జయా! పసిపిల్ల పార్వతి యేమిసేయుచున్నది.

జయ:—అమ్మా! దూరముననుండు, చెట్టుక్రింద గూర్చుండి తనలోదానేమేమో, గొణుగుకొనుచు, గూర్చున్నది.

మేనక:—మీరేమిదయ్యాలే! పసిపిల్లనొంటరిగవదలి రానగునా; బుద్ధిహీనులారా పిలుచుకొనిరండి భయపడెనేమో.

జయ:—నేటోయి యెత్తికొనివచ్చెద.

( జయ యెత్తికొని వచ్చుచుండును. )

మేనక:—( పార్వతినిజూచి )

అ ను బ ం ధ ము 25.

పార్వతీ! నానోములపంటా, ఏమిచేయుచుంటివి.

పార్వతి:—అమ్మా! ఆడుచు పాడుచునుంటిని.

మేనక:—తల్లీ! అచట నీతో నెవరాడుచుండిరి.

పార్వతి:—ఒక చిన్న పిల్లకాయ శంకరుడనువాడు వచ్చి నాతో నాడిపోయెను.

మేనక:—వానితో నీవేమియాడితివి.

పార్వతి:—నాకు వాడు పాటలునేర్పెను.

మేనక:—ఏమిపాట నేర్పెనమ్మా, వీనులవిందుగ విననొకపాట పాడుము.

పార్వతి:—పాడెద వినుము.

అ ను బ ం ధ ము 26.

మేనక:—అమ్మా! యిది దేవుని ధ్యానము, శంకరుడు, మంచిపాటనేర్పినాడు. ఇది యొకటేనా! ఇంకేదైనను, నేర్పెనా.

పార్వతి:—ఇంకొకటినేర్పెను.

మేనక:—ఏదీ! పాడుము.

పార్వతి:—పాడెదవినుము.

అనుబంధము 27.

మేనక:—అమ్మా! మంచిపాటలు నేర్పినాడు. బాగారమ్మ, ప్రొద్దైనది, లాలిలోబరుండుము (అనుచు నెత్తుకొని యుయ్యాలలో బరుండబెట్టును.)

అనుబంధము 28.

ద్వితీయరంగము.

( మేనక - పార్వతి - చెలికత్తెలు, - జయ - విజయ - భానుమతి. )

మేనక:—(దూరమున నాలోచనాధీనయైన పార్వతినిఁజూచి) అమ్మా పార్వతీ! నీ చెలికత్తెలందఱు నీతోడ నాడికొనవచ్చినారు. వారినిఁగూడి యాడికొనుము.

పార్వతి:—ఆడుకొనుటకు శంకరుఁడువచ్చినాడా?

మేనక:—(స్వగ. మంచిశంకరుఁడు గంటుపడెను) (ప్రకాశముగ) అమ్మా పార్వతీ నీవు పలికిన శంకరుఁడెచట యున్నవాఁడో తెలిసికొని రాను నే మనుష్యులను బంపినాను. ఇంతలోనె శంకరుని వార్త వారుదెత్తురు రమ్ము ఆడుకొందువు.

పార్వతి:—ఆడికొనెదను.

మేనక:—ఏయాట యాడెదవు?

పార్వతి:—గొబ్బిళ్లాట.

మేనక:—మంచిది ఆడుము.

అనుబంధము 29.

మేనక:—పార్వతీ! గొబ్బిపలాడి యలసితివి. నీ చెలులంగూడి కనుమూసులాటలాడుము.

పార్వతి:—మంచిది.

## అనుబంధము 30.

జయ:—అమ్మా దైవప్రార్థనయాయెను. ఇఁక మనవస్త్రములు దాచి యేరుదము.

పార్వతి:—మంచిది. ఇదిగో నాపేరుగలవస్త్రము దాచితిని. మీరును వేయుఁడి. పరుగిడి వచ్చి వెంటనే యెవరివస్త్రము వారు తీసుకొనవలెను.

చెలులు:—మంచిది [అనుచుఁ దరు తమ వస్త్రములు దాతురు.]

విజయ:—అమ్మా పార్వతీ! ఓడినవారికేమి శిక్ష.

జయ:—శిక్షయేమి. మగనిపేరు చెప్పవలెను.

పార్వతి:—మంచిది అటులనేచేయుదము.

[అందఱు గుంపుగ పరుగిడివచ్చి కన్నులుమూసుకొని వస్త్రము లెత్తుదురు. పార్వతి తప్పు వస్త్రమెత్తును.]

చెలులు:—గిరిజా! తప్పిపోతివి. మగనిపేరుచెప్పవలెను.

పార్వతి:—నేను చెప్పను.

చెలులు:—నీవు చెప్పే తీరవలెను.

పార్వతి:—నేను చెప్పను. నా మగనిపేరేమి యగ్గువపడ లేదు.

చెలులు:—అగ్గువో, ప్రియమో, మాకుదెలియదు. నీవు చెప్పేతీరవలెను. మేమువదలము.

మేనక:—అమ్మా పార్వతీ! ప్రారంభమునందే, పందెములు వేసుకొన్నారు. నీవు మగనిపేరు చెప్పవలెను.

పార్వతి:—[సిగ్గు నభినయించి బలవంతమున సాంబశివుఁడని పలుకును.]

చెలులు:—పార్వతీ! ఏమే, కోరునది కోరి ముసలిజంగమయ్యను గోరితివి. మరియెవరు సుందరపురుషులు లేరా?

పార్వతి:—[తల్లినిఁజూచి] అమ్మా నేను వీరితో నాడుటకు నిష్టములేదు. నామగనిని నిరాకరించి మాటలాడెదరు వీరు. ఏప్పటికి నిటులనే చేయుచున్నారు.

చెలులు:—అమ్మా పార్వతి క్షమింపుము. ఇఁకముందు నీ మగనిని దూషింపము. మగనిమీద పద్యము చెప్పుట తప్పించుకొనవలెనని యీ లేనిపోని కోపము తెచ్చి

కొంటావో? మంచిరొయుత్తుగద వెకిలివి. పిల్లవైనను జాణవే? మేమువదలము. మగనిపాటపాడుము.

పార్వతి:—మంచిది, పాడెద.

అ ను బ ం ధ ము 31.

తృ తీ య ర ం గ ము.

పర్వతరాజు - పార్వతి - మేనక - ఇంద్రుఁడు - నారదుఁడు.

పార్వతి:—నాయనా! ఆ సర్వేశ్వరుని, ఆ జగత్కర్తనుదప్ప నితరులను నే మోహెత్తియైనను జూడను. ఆమాటలిఁక నాడకు.

అ ను బ ం ధ ము 32.

మేనక:—బిడ్డా పార్వతీ! నామాటవినుము. నీతల్లినై నీ హితంబుఁ గోరుచుందునుగాని యహితంబుఁ గోరుదునా? ఎందునుగానరాని యా గరళకంఠుని నాశించి ఘోరతపంబుసేసి నీయందమెల్లఁ జెఱచుకొంటివేయని చింతించెద.

సీ॥ చిగురుల తొగరుల నొగిలించు
జిగిమోవియూర్పుల సెగలఁబొగలె
నక్కచెక్కులు టక్కుముక్కలంచని, నును
పెక్కుడుచెక్కుల, నిక్కుఁదిక్కె
అలికులంబులఁదూలి యలికంబునలరించు
నలకలుచెదరుచుఁ గలకఁబాఱె
అంబుజంబులతంబు నంబుజరిపుబింబ
బింబఱసేయు మొగంబువాడె

గీ॥ బాల, యీ ఘోరతపమేల? చాలునిలుపు
గోలతనమేల? యబలలకేలతపము?
తండ్రికొండంతనుండఁగఁ దనయకేల
[illegible] తరుణివినుము.

అమ్మా! పార్వతీ! నీకోరినవరునకై నీయందివఱకు సల్పినతపంబు చాలదా? మరలఁ దపంబునకుఁ జన నేల? వలయునేని సురలలో ననేకులు సుందరపురుషులున్నారు. దిక్పాలురకుమారులున్నవారు. సరకుసేయని హరుఁడేకావలెనను నేమమా?

పార్వతి:—అమ్మా! మేనకా! ఏమిమాటలాడెదవు? మనముగోరని పురుషునిఁ దరుణి వరించునా? అట్టిపురుషునకు పెద్దలగువారు తమబిడ్డలనిచ్చి పరిణయంబొనర్చుటకంటె, నొకస్త్రీబాలికిచ్చి పెండ్లిసేయుట మేలుకాదా!

కం॥ మనమూవరింపనిపురుషుని
వనితామణి యెటులఁ దాను వలచునొ చెపుమా
యనురాగము స్నేహఫలం
బనుమర్మము, నీకుఁ దెలియదా? జనయిత్రీ.

తల్లీ! నాకా మహేశ్వరునిపై ననురాగము పుట్టుకతోడనె పుట్టినది. కావున నా జగత్కర్త నామముదప్ప నితరులనామము నాయొనుట నుచ్చరింపకుఁడు. మిము వేఁడెద.

(ఇంద్రుఁడును, గానముసేయుచు నారదుఁడును బ్రవేశింతురు.)

(మేనక పర్వతరాజులు వారికి నమస్కరింతురు. నారదేంద్రులు పార్వతికి నమస్కరింతురు.)

పర్వతి:—(స్వగ) ఏమివిచిత్రము! ఇంతటిగొప్పవారు, ఇంతటి జ్ఞానవిశారదులు చిన్నదాని పాదములంబడి నమస్కరించుచున్నవారు.

(నారదునింజూచి) మహానుభావా! మిమ్ముఁబోలు పెద్దలు మిమ్ముఁబోలు జ్ఞానవిశారదులు నా సుతకుఁ బసికూనకు నేమియుఁ దెలియని ముగ్ధురాలకు నమస్కరించితిరే కారణంబేమి?

నార.—ధరాధరాధిపా! ఏమియుఁ దెలియని వాఁడవు నీవు కావున నీ ప్రశ్న సముచితముగనున్నది. నీసుత జన్మవృత్తాంతంబు నీకుఁ దెలియదు. ఈ సౌందర్యలావణ్యఖని, లోకజననియగునీకాని. పూర్వజన్మంబున దక్షునికూఁతురై పుట్టి దాక్షాయణియను నామంబునఁ బ్రసిద్ధికెక్కి త్ర్యంబకునిదారయైయుండెను. దక్షుఁడు శివద్వేషియై నిరీశ్వరయాగంబు సలుపుచు శంకరుని శంకసెక్కి దూషించిన

కారణంబున, నా గర్వపూరితుని, జడుని యీశ్వరక్షైరి పుత్రిగా యుండఁ జాలక సపవాగ్నింబడి నీ పురాకృత పుణ్యఫలంబున నీకుఁ బుత్రిగా యీ ధాత్రిజనించినది. కావున నాలోకమాతకు నమస్కరించితిని. అచలాధీశా! ఈ సురేశుఁడు సకలవైభవ సంపన్నుఁడైనను సర్వస్వముఁ గోల్పోయి యాచకుఁడై నన్నొకటి యర్థింపవచ్చినాఁడు.

పర్వతేఁ:—మహానుభావా! దిక్పాలాగ్రణియగు సురేశునంతటివాఁడు పాషాణాధిపతిగఁ బడియుండునన్ను యాచించు నదేమియున్నది? అయినను యాచనార్థంబు నాశక్తికొలఁదేని నిస్సంకోచంబుగ నిత్తును. దానికిసంకోచమేల?

నారదుః:—(ఇంద్రునిఁజూచి) సురవల్లభా! నీ యభీప్సితంబు ఫలింపఁజేయు నీ యుదారచరిత్రుఁడు పర్వతాధినేత సర్వసిద్ధుఁడుగనున్నవాఁడు. యాచనకువచ్చి మర్యాదపై దృష్టియుంచుకొని మౌనమూనితివేని ఫలమెటు సిద్ధించు. నీ వృత్తాంతంబుఁ దెలిపికొని నీకోరిక వెల్లడింపుము.

ఇంద్రుఁడు:—మహానుభావా?

సీ॥ తారకాసురుఁడను దానవుఁడొక్కఁడు
కాలకాలుని వరగర్వమతిని
దిక్పాలకులనెల్ల దీనతఁగుందించి
నావిభవము నెల్ల నాఁచికొనిరొ
వనవాసమునుగని మనియుండమన్నను
కొంచకవాఁడు గాసించునచట
బాధలోపక మేము బ్రహ్మకు మొఱలిడ
శర్వతేజమువానిఁ జంపుననిరొ,
గీ॥ శర్వుఁడొ ధీరుఁడయి యోగసత్త్వమునను
స్థాణువుగనిచ్చెనటవినిఁ దపముఁబూని
సర్వశక్తునిఁగదలింపఁ జాలమయ్య
బ్రదుకుమార్గముఁజూపుమా పర్వతేశ.

(అనుచు నమస్కరించును.)

పర్వత:—అమరవల్లభా! లెమ్ము నిన్నుఁబోలు దేవేంద్రుఁడు దిక్పాలాగ్రణి నాకు నమస్కరింపనగునా?

నార:—ఏమిసేయవలెను. కాలమట్టిదవచ్చినది. గ్రహచారము చాలనికాలమునఁ నేను పెద్దనని బిగిసికొనినఁ బ్రయోజనంబేమి?

పర్వత:—దేవేంద్రా! మీవంటిబోలు మహనీయులు నారదులంటి జ్ఞానవిశారదులు కార్యజాలంబోలు శక్తిమంతులు సేయనోపనికార్యంబు నేనెటుసేయఁగలను?

నార:—అప్పుని నీ నుడివిన వారిచేతనగునదికాదు. నీచేతనగునదిన్ని కాదు.

పర్వ:—అటులైన నన్నడుగనేల.

నార:—పర్వతేశా! ఈ లోకమాత పార్వతి యీ దేవతాకార్యంబు నిర్వహింపశక్తి కలది.

పర్వ:—దానికి నేనేమిసేయవలెను?

నార:—ఆ శంకరునిపూజకు నీసుతనునియమించినచో పూర్వజన్మ సంస్కారవాసనా బలంబున నా కృత్తివాసునిమనంబు చలింపఁజేయును. దాననుండి దేవతాకార్యంబు సఫలంబగు.

పర్వ:—(ఇంచుకయాలోచించి పార్వతినిఁజూచి) బిడ్డా పార్వతీ! ఈ మహనీయుల మాటలు వింటివికదా! అటులొనర్తువా?

పార్వతి:—నాయనా! ఆ జగదీశ్వరుని తపంబుమాన్పుట యతిదుర్లభంబు ఘోరతపం బొనర్చినంగాని పూజలచే నతఁడు చలింపఁడు. అయినను పెద్దలమాటలనే నుల్లంఘింపఁజాలను. కావున నేఁబోయి యా చంద్రశేఖరునిఁగని కొన్నిదినంబులు భయభక్తులఁబూజించెద. దానికి నాజగదీశ్వరుఁడు వరదుఁడుకాడేని నతనింగూర్చి ఘోరతపంబొనర్చెద: ఎటులనయిన నానిటిలాక్షుని వరునిగఁగొని సురలకార్యంబు సఫలంబుజేసెద.

అ ను బ ం ధ ము 33.

దేవేంద్రు:—(పార్వతికిమ్రొక్కి)

ఉ॥ హాయిగనుందునేనిఁక నహార్యతనూభవ! నిన్నుఁగాంచు,
త్యాయినినావెతల్ జనిరొ; ధన్యుఁడనైతినియుంబ! నైళమే

యాయభవుల్ భజించుచు శుభావహరీతినిఁ బెండ్లియాడుమా
నీ యడుగుల్, సదామదిని నిల్పి భజింతును; మాత! నమ్ముమా!

(పునః ప్రణామంబు లాచరించును.)

నార:—త్రిదశాధీశా! నీవువచ్చినకార్యంబు సఫలంబాయెనుగదా! ఇఁకజాగేల? మనము వెళ్లెదము. రమ్ము. (పర్వతరాజునుజూచి) మేనకాపతీ! మేమింకఁబోయి వచ్చెదము సెలవిమ్ము.

పర్వ:—వందనంబొనర్చును.

(నిష్క్రమణము.)

చ తు ర్థ ర ం గ ము.

పార్వతి - ఈశ్వరుఁడు.

( ఈశ్వరుఁడు తపంబొనర్చుచుండును. )

అ ను బ ం ధ ము. ౩౪.

పార్వతి:—( వచ్చి సాష్టాంగనమస్కారములొనర్చి )
అకారం ఉకారం మకారం తృతీయ్యం
సదానాదుబందుః కళాతీతపూతం
హరిబ్రహ్మరుద్రం పరబ్రహ్మరూపం
చిదానందరూపం శివోహంశివోహం ॥ ౧ ॥

అనాకాశమాకాశ మాకాశరూపం
నిరాకారసాకార ఓంకారగమ్యం
సహస్రారమధ్యస్థ బిందుస్వరూపం
చిదానందరూపం శివోహం శివోహం ॥ ౨ ॥

సుషుమ్నాంతరస్థం పరబ్రహ్మనిత్యం
మునిస్వాంతవేద్యం మహాపద్మపీఠం
నిశాంతేదినాంతే త్రికాలేవసంతం
చిదానందరూపం శివోహం శివోహం ॥ 3 ॥

అహంనిర్వికల్పో నిరాకారరూపీ
విభుత్వాదిసర్వత్ర సర్వేంద్రియాణాం
సదాసమ్మతం నవ్యముక్తిప్రబోధం
చిదానందరూపం శివోహం శివోహం ॥ ४ ॥

(చిదానందాష్టకములోని శ్లోకములు.)

వారిశతూణీర, వందారుమందార
శౌరిప్రియానీకుశర్వ శరణు
పాపాంధకారప్రదీపాద్వయానంత
రూపా, మహాదేవరుద్ర శరణు
రాకేందుకోటి ప్రతీకాశలోకోరు
శోకార్తిహరణ సుశ్లోక శరణు
దీనావనాత్యంత హీనాగమాంతైక
మానోదితాభూరి మహిమ శరణు

గీ॥ చిన్మయానందసద్రూప జన్మరహిత
శంకరా! చంద్రశేఖర! శరణుసాంబ
కుటిలకుంతలదయఁగను నిటిలనేత్ర
ప్రాణపతిఁగాఁగ నినుఁగొల్తుభక్తియుక్తి.

అనుబంధము 31.

సర్వగీర్వాణ సర్వాంగీణ నమస్కారభూషితపాదా! చంద్రార్ధఫాలా. సదాశివా! ఈశ్వరా! నినువరునిగఁ గోరి తపమొనర్చితి. నీపాదములు భయభక్తినిఁ బూజించితి. ఎంతతపంబొనర్చినను నిన్నెంతిగఁ బూజించినను నాపై నీకుఁ గరుణరాదాయె. శంకరుఁడు భక్తవత్సలుఁడు సులభవరదుఁడను బిరుదు ననుఁబోలు నబలయందా నిరర్థకమగుచుట? మహాదేవా! నీకుఁగాను నే ననేకయుగంబులు తపంబొనర్ప నోపికకలదాననైనను దేవతాకార్యంబు నన్నుఁ ద్వరపెట్టుచున్నది. ఎన్ని వత్సరంబులు నీసరసఁజేరి ననుఁబూజించినను నీకు నాపై దయఁబుట్టదు. కాని, కాని.

ఉ॥ కూరిమిఁ బ్రోచు దైవమని కొల్చితి నిన్ను సదాముదంబునన్
గారణ మేమొ నీవు ననుఁ గాంచవు పల్కవు జీవితేశ్వరా
నేరమదేమి సేసితి నినీలగళా! వినునా ప్రతిజ్ఞనున్
ఘోరతపంబొనర్చి నినుఁ గూడక మాననను చంద్రశేఖరా.

సదాశివా! చంద్రశేఖరా! ఘోరతపంబొనర్చి యెటులనైన నినుఁగూడెద. వదలను. [అనుచు వెళ్లును]

ఈశ్వరుఁడు:—[పార్వతినిఁ గ్రేఁగంటఁజూచి] హా. హా. చిరకాల వియోగానుభవానంతరమున నా సతీదర్శనం బయ్యెను. [ఆలోచించి] కూడదు. ఇప్పుడే పోయి పల్కరించినఁ జులకనయగుదును. ఈసతి మనోదార్ఢ్యమెట్టిదియో నేఁ బరీక్షింపవలెను. ఈ గౌరి తపంబుఁబూనునఁట? నేను వృద్ధుఁడనై యాతరుణీమణినిఁ జేరి నన్ను నే నేదూషించుకొని మాటలాడెద. నా దూషణవిని యీవనిత యేమిపలుకునో చూచెద. ఇఁక నాకు మనోదార్ఢ్యము కనపడదు. పోరాదు. సతినిఁ జేరెద. తపంబుచాలించెద. దేవతాకార్యంబు నెరవేర్చెద.

(నిష్క్రమము.)

## పంచమరంగము.

[పార్వతి - వృద్ధబ్రాహ్మణుడు - జయ విజయలు - చెలికత్తెలు.]

[పార్వతి తపంబు సేయుచుండును.]

జయ:---చెల్లెలా! ఇదియేమిఘోరతపమే? ఆడువారింతటి తపంబొనర్చుట నేనెచటను గనలేదు. ఎవరినుండియు వినలేదు.

కం॥ ఊహాతీతునినీశుని
మోహించి తలంచి ముదిత మునివరునివిధం
బాహారాదులవదలెను
సాహసమిది, యేమి సేయఁజాలము చెలియా.

విజయ:---అక్కా! నాకేమో సిగ్గుగనున్నది. వరుఁడేవచ్చి వనితలనుజూచి కాంచియ మనసులఁబడి పేఁడికొనినను బిగిసికొనియుంట చిగురుబోఁణులయందు సామాన్య గుణముగనుండును. అందుకువిరుద్ధముగ మనయక్కయ్య తెచ్చుటనో మాన ముపహించి బూడిదపూసికొనియున్న జోగిని మనమున నేవరించి యీరీతి ఘోరతపంబొనర్చుట సిగ్గులచేటుగనున్నది. నాకు నిది తలవంపులుగనున్నది.

కం॥ తలవంపులు యేమనకును
చెలియా! యిదిచూడ! యేమి సేయఁజాలమీ
చెలినడకలువింతలయో
తలిదండ్రులుగాని తెలుపఁదలఁపరుహితముక.

జయ:---చెల్లెలా! నిజము. నిజము. మనయక్కయ్యను జూచి, లోకములోఁ గన్యలు నైతమీ గుణమే నేర్చుకొందురేమోయని భయమయ్యెడు. అట్లైనచో చిన్ననాటనుండి ముద్దుగఁబెంచిన తలితండ్రుల యధికారము బిడ్డలపై నేమి నిలుచును?

విజయ:---ఊరక చింతించిన నేమిప్రయోజనము?

[వృద్ధబ్రాహ్మణుని ప్రవేశము.]

అ ను బ ం ధ ము 35.

జయవిజయలు [బ్రాహ్మణునకు నమస్కరించి] స్వామీ! తామెవరు? ఈ నగరంబునకేల వేంచేసితిరి?

వృద్ధ:---కన్యకామణులారా! నేనొకవృద్ధయోగిని. ఏకాంగిని. కాననంబులును బుణ్య
క్షేత్రములును సంచరించుచుఁ గాలక్షేపము సేయుచుండువాఁడను. ఈ పుణ్య
నగరంబులందుఁగల చిత్రములఁజూచి తపంబొనర్చి యీ వృద్ధమానవవేషంబు
బాలవదలి శైవసారూప్యపదవి నందఁదలంచితిని.

విజయ:---నిజము. ఘనులగువారి నటనలట్టివియగదా?

వృద్ధ:---చెలులారా! ఈ యువతి యెవరు?

విజయ:---అయ్యా! అచలరాజపుత్రియగు పార్వతి.

వృద్ధ:---ఏమి ఏమీ! అచలరాజపుత్రియా? అటులైన నీదిదియేమి దౌర్భాగ్యము? అచల
రాజు సకలైశ్వర్యవంతుఁడే సకలభోగానుభవముల నిక్కువాఁడే. అట్టి శ్రీ
మంతుని సుతకిదియేమి దౌర్భాగ్యము గంటుపడెను? ముఖసౌందర్య మిందు
ద్యుతిని నపహసించుచున్నదియే? శారీర లావణ్య తారుణ్య శృంగారరసంబు
వెల్లిగొనుచున్నదియే? ఇట్టి శృంగారవతి తపంబున వాడుకారణం బేమి?

అ ను బ ం ధ ము 36.

జయ:—బ్రాహ్మణోత్తమా! ఈ సర్వమంగళ బాల్యంబుననుండియు నా నిటలలోచ
నుని శివునిధ్యానించుచు, దివారాత్రంబులు శివమంత్రంబు జపించుచు, శివ
నామంబులు సావధానముగఁ జెవులొగ్గి వినుచు, శివసంకీర్తనంబులు సేయుచు,
శివుని గుణకథలు నుడువుచు, సర్వప్రపంచంబు శివమయంబని తలంచుచు,
నా శివుఁడే తనకుధవుఁడని కోరుచు నిరంతరంబును దురంతంబగు చింతచేఁగృ
శించుచు, నా శివునిఁగూర్చి తపంబునలుపుచున్నది. ఏమిసేయుదుము?

వృద్ధ:—అదియునిష్టమయినదని మీకుఁదోఁపదాయెనా?

జయ:—మాకుఁదోఁచిన నేమిప్రయోజనము?

వృద్ధ:—నిజము నిజము. మీరేమిసేయఁగలరు? సుదతీమణులారా! మీ చెలి యీ సమా
ధినిష్ఠనుండి లేచుకాలంబెద్ది.

జయ:—అపుడే ప్రొద్దైనది నేఁడెమో యాలసించినది. ఇపుడే లేచును. (పార్వతిసమాధి
నిష్ఠచాలించి కనుఁగవతెఱచి వృద్ధునిఁజూచి)

పార్వతి:---ఓ పురాణపురుషా! ఈ నిర్జనాటవికి నేలవచ్చితివి?

వృద్ధు:---యువతీ! ఏకాంగినై యుండనోపక నగతలమందలి చిత్రములఁ జూడవచ్చితి.

పార్వతి:---విప్రోత్తమా! ఇచటఁ గొంతకాలమునుండి నేనిచ్చు నాతిథ్యమునుఁగొని చనియెదరా?

వృద్ధ:---రమణీ! కన్యలిచ్చు నాతిథ్యమును దిరస్కరించు బురుషు లెందైనఁగలరా? పవిత్రముగఁగొనెద. ఆతిథ్యము మాటటులుండనిమ్ము! సకలభోగానుభవముల నుజ్జగించి నీవీరీతి ఘోరతపంబుల యభవుఁడు భవుఁడు నీకావలెనని కోరుచుఁ జేయుచున్నావని నీ చెలులు పలికిరి. నిజమేనా?

పార్వ:---బ్రాహ్మణోత్తమా! నిజము. సత్యము. సర్వమంగళుండును సర్వమేయుండును నగు శంకరుని దారనగుటకై యీ తపంబు సలుపుచున్న దానను.

వృద్ధ:---(తలయూఁచి) ఓ నీలాహివేణీ!

ఉ॥ అచ్చెరువయ్యె నాకు హృదయంబున, వారిజపత్రలోచనా
నిచ్చలమైన నీసొగసు నీరధిఁద్రోయఁగ సాహసింతువే
పిచ్చియొ? వైరులేరయినఁ బెట్టిరొ మందులు? బుద్ధిజాడ్యమో
మెచ్చఁగవచ్చు మేదినిని మేచకకుంతల! నీగుణంబులన్.

పంకజాననా! బంగారుపువ్వుంబు పరిమళంబుఁగని పొంకమగురీతి నీమేని యొల జవ్వనము నీవ్వానియందునిలచి వన్నెసేయుచున్నావు. ఇదియొకటియుచాలక యీ ముదసలి జంగమదేవుని భర్తనుఁగాఁగోరి మఱియొకతప్పు చేసినావు. కలికీ! ఆకప్పెరకేల్పికిరంపు జోగినిఁ బతిగఁగట్టికొని నీవేభోగంబు లనుభవింపఁజూచెదవు? లోకులకు రెండుకన్నులుండ నతనికి మూఁడుకన్నులుగలిగి విరూపాక్షుఁడని పేరందినాడు. అందునఁ బగలొకకన్నుగుడ్డి రాత్రియొకకన్నుగుడ్డి మూడవకన్ను మంటలునిండి పొగఁగ్రమ్మి యెట్లనై రేఁగియుండును. అట్టివాఁడా నీకుఁబతి? భామా! గాములుచుట్టుకొని కేకలు వేయుచుండఁ బాములు బుస్సు బుస్సుమని నాలుకలుజాచుచుండ, కాటిబూడిదె మైపూతై కంపు కొట్టుచుండ, త్రికాలమునకుఁగ్రుచ్చిన పీనుఁగల దుర్గంధము నలుదిశలు వ్యాపించుచుండ దిగంబరుఁడై సాయంసమయమున నాట్యమాడు నటునకా నీవు సతివిగాఁగోరెదవు? కాలకూటవిషంబు మెసవుదుఁ, నేనుఁగుకళేబరంబు వసనంబుగఁగల యాతనికంపు

జోగినిఁ గట్టికొనుట నీతలవ్రాఁతయా? తెలియరానైలేక వెంట్రుకలుజడగట్టి ప్రేలాడుచుండు నిత్యభిక్షకుఁడు నీ యభ్యంగనస్నానమునకు శిరమున వెూనిదియుండు నీరుకుమ్మరించునుగాని నూనెయిచ్చునా? నారీ! కౌతుకోపేతమైన నీ కరమును నా గజచర్మవసనుఁడు ఉరఘుజగకంకణ కరమునఁబట్టినపు డావెనుపాము నినుఁగఱచిన నీవేమి చేయఁగలవు? అన్నుమిన్నా! పెండ్లికాలమున నీ చిన్నెలహొన్ను వహియించు చీరచెఱగునకును నా, నెత్తురోలికెడు వేనుగుక్రొత్తతోలు వస్త్రమునకును ముడివడునా? ఇదియేల యాలోచింపవు? చందనగంధీ! నీకాభస్మాంగుఁడు పతియగ్యాణేని చందనగంధ లిప్తాపోవమునఁ బరిఢవిల్లు నీమేను బూడిదెపూతకంపనఁ జెడదా? నీవు రాజసుతవు. దినదినముదిక్పాలుర కానుకగఁబంపు గజములపై వాహ్యాళి వెడలుదువు. అట్టి శ్రీమంతురాలవు వివాహోత్సవమున నూరేగింపుసమయమున నా విరూపాక్షునితో ముసలియెద్దునెక్కి పట్టణమున మెరవడివెళ్ల నెంతయుందవముగనుండునో గదా. అట్టివానినిఁ బరివారు సరివారు చూచినగరా? అపహాస్యంబు సేయరా ఇటియున్నయి నటులుండనిమ్ము. వరుసకు వర్ణ్మము గుణములోకటియయిన నా హరునకుఁగలదా! రూపమా విరూపాక్షుఁడు. ఐశ్వర్యవంతుఁడందమా దిగంబరుఁడైన నిత్యభిక్షకుఁడు. విద్యాధికుఁడందమా పశుపతి. కులగోత్రములందమా వాని తలితండ్రులెవరో తెలియదు. ప్రాయమందమా పురాణపురుషుఁడు. నీవుపుట్టి యుండగనైతెను అవరాలిని నామందుకుత్రికినిస్పట నెటులుండుననిన యజ్ఞముసేయుటకై దిక్కి మంత్రపూతమైన యూప స్తంభమునువదలి కాటిలోనికట్టను బూజించినపిదపమగును. చేలా! ఈలాగునగోలతనంబుఁ బూనకు.

గీ॥ సాంద్రభోగంబులివ్వఁగ నింద్రుఁడగునె?
చక్రధారియె నిర్వక్రవిక్రమమున
వైభవాళిని వారిధివల్లభుండె
ధనసమృద్ధినిధనదుఁడే తరుణి చెపుమ.

సుందరీ! నీసౌందర్యాతిశయంబుఁ గనినవాఁడు, పంచముపుట్టిన ముసలివాఁడైనను లేచికూర్చుండునుగదా? అట్టి నీయంగ మవలింగాచిన వెన్నెలసేయుకు. నీవుగోరిలేని నలగూబరుఁడున్నవాఁడు. జంభారాతి హరి విరించి జయంత వసంతులున్నవారు.

వారినెల్లరినివదలి మునిజోగిని నిత్యదరిద్రుని గోరుట ముదితా నీకుఁదగదు. తగదు. నా హితము వినుము )

పార్వతి:—(శివశివాయని చెవులుమూసికొని.)

మ॥ పొగురా? పోసరమా? ద్విజోత్తముఁడ, సంపూజ్యుండ వృద్ధుండ, నెం
తగ నెవ్వారిని నాడఁజెల్లునను మత్తా! గర్వమా! మాంద్యమా!
జగతీనాథునిఁ జంద్రశేఖరుని నీశానున్ జగత్కర్తనున్
తగవా తుచ్ఛము గానుబల్క? మతిలేదా నీకు? విప్రాధమా!

విప్రాధమా! కోటిసూర్యప్రభాభాసమానుండును, గుణత్రయాతీతుండును, సచ్చిదానంద స్వరూపుండును, శ్రేయస్స్వరూపుండును నగు శివుని నిర్గుణుండని నోటి క్రొవ్వున మాటలాడితివిరయే. ఎంతటిసాహసమిది? వృద్ధుండవు గాన బుద్ధిహీనుండవై పలుకుచున్నావు. బ్రహ్మవిష్ణు సురేశాది దిక్పాలురెల్ల నీశ్వరుని సమానులగుదురా?

సీ॥ త్రిజగముల్బాధించు గజదైత్యుఁ జీలిచి
పాలించె నెవ్వఁడో బాపనయ్య!
అలజలంధరుఁ జంపి యమరాళి నెల్లను
బాలించె నెవ్వఁడో బాపనయ్య!
హాలాహలము మ్రింగి, యాలోకముల నెల్లఁ
బాలించె నెవ్వఁడో బాపనయ్య!
ప్రళయాంతమందునఁ బ్రాణాణువుల నెల్లఁ
బాలించె నెవ్వఁడో బాపనయ్య!

గీ॥ తెలుపుమా తెలిసియుండినఁ దెలివియున్న
హరియొ, ధాతయొ, నిర్జరవరుఁడో! యముఁడో!
అగ్నియో, నైరృతియొ, సలలాధిపతియొ,
యనిలుఁడో, కిన్నరేశుఁడో, హరుఁడో, కనుమ?

బ్రాహ్మణాధమా ! నే నుడివిన వెల్లను మనంబున నాలోచింపుము.

ఈశ్వ:—భవానీ! నీ నుడివినమహిమలన్నియు నైంద్రజాలంబులు. భవానీ! నిర్గుణుండను వికృతకృత్యుండను, భుజంగభూషణుండను కల్యాభరణుండను, చర్మవసనుండను, దిగంబరుండనునై డమరుకాగ్ని మృగంబులు కరంబునధరించి భూత ప్రేత పిశాచంబులు కరతాళంబులుసేయ, శ్మశానంబునం గీకసరాశిపైం గపాలమాలికలు చెదర, జడలల్లాడ నాడుచుండెడినట్టి, నీవువరించువేని సంతతం బెను హెచ్చు హేయకృత్యములుసేయ నేనోపుదు నన్ను వరింపుము. (నవ్వును)

అనుబంధము 37.

పార్వతి:—(చెలులంజూచి) చెలులారా! వీండెవండో దధీచిశాపతప్తుం గుదువారిలో నొకండు. శివదూషకుండు. శివనిందకుండు పతితుండనియెఱుంచి వాండుండిన స్థలమునసైన నుండంగూడదని శాస్త్రములు పలుకుచుండును. "శివనిందాకరం దృష్ట్వా, ఘాతయేదథవా శపేత్ తత్స్థానం వా పరిత్యజ్య" యనియున్నది కాన నీపతితుని మోముంజూడంజాల. వాండిచట నిలిచి యీస్థలం బపవిత్రముసేసెను కావున నేనిచట నిలువంజాల. చెలులారా రండుపోవుదము. (అనుచు వెళ్లను.)

వృద్ధు:—హా. హా. ఈ మత్తకాశిని చిత్తవృత్తి నిర్దోషమైనది. నను నమ్మినది. ఇంక నేనిటు పరిహాసములు సేయుచుండినయెడల మోసమగును. కావున నీ హిమాచల కన్యకకుం బ్రత్యక్షుండనయ్యెద.

(అనుచుం దెరలోనికివెళ్లి స్వస్వరూపమున సర్వేశ్వరుండు పార్వతి కేలుం బట్టి పిలిచికొనివచ్చును.)

పార్వ:—సీ॥ ముదితలమెడనింత, మోసముల్ప్రచరించు
నెమ్మెకానిని నిన్ను నమ్ము టెటుల?
ఈశ్వ.— ఇందీవరాక్షినీ చెందముంగనుంగొన
నమ్మెయిపచ్చితి నమ్ముమబల.
పార్వ:— కాంతనుగామించు కామి, తానెందు, ని
జమ్మునాడునె వానినమ్ము టెటుల?
ఈశ్వ:— కాంతామణీ నీదు స్వాంతమునుంగగన
నెమ్మివృద్ధుండనైతి నమ్ముమబల?

పార్వ.—గీ. వేదబమ్మలు నటించు వేషధారి
నిటిల నేత్రుండనీవని యెటులనమ్మ
ధాత్రినంతయు నాడించు సూత్రధారి
యగుదునే నని యెఱుంగనే యార్య! నీవు.

పార్వతి:—నీవు నాటకంబులో వేషధారివి. ఎన్ని వేషములనైన ధరించి, జనులను మోస గింపఁగలవు? కావున నీవాహారుఁడని నేనునమ్మను.

ఈశ్వ:—ఆర్యా! జగమునే, రంగస్థానముగ నేర్పఱచి యందుండు జీవకోటులకు వేషములఁగల్పించి, యా యా వేషములకుఁదగిన భాషను నిర్మించి సంకల్పానుసారముగ రసములుప్పతింపఁజేసి సూత్రమునఁబట్టి యాడించు సూత్రధారిని నేనని, నీకుఁ దెలియదా? అట్టియెడ నీకిపుడు క్రొత్తయా! నటుఁడను నేనయి నటనఁగాదక యుటమటించుచుంటివి. ఇపుడునీవు దొరికితివి. కావున నీకు నీ ప్రాపంచక నాటకమునకే కొంతయుఁగలుగదు.

పార్వ:—మాయావీ! నీవు నిజముగ నీశ్వరుండైతివేని నేన నమ్మఁదగిన గుర్తులుకొన్ని నాకెఱుకపఱుపుము.

ఈశ్వ:—(పార్వతిముఖముమీద కేలాడించి) పార్వతీ! పూర్వజన్మమున నీవు దక్షుని పుత్రివయి దాక్షాయణీ నామంబునఁ బ్రసిద్ధికెక్కి నాదారవై విలసిల్లితివి.

పార్వతి:—పిదప.

ఈశ్వ:—నీతండ్రి దక్షుఁడు నాతోద్వేషించి సన్నానావిధముల దూషించుచుండ, నీవు నాదూషణవిని సహింపనోపక సవనాగ్నినిఁబడితివి. ఇపుడీ పర్వతరాజునకుఁ బుత్రివై జన్మించినావు.

పార్వతి:—ఔరా మాయకాఁడా! యివ్వార్త లోకప్రసిద్ధిగనున్నది. ఎవరినోటనుండి యైనను వినియుందువు. ఇదిచాలదు. ఆకాలంబున మనయిరువురికిని జరిగిన రహస్యవృత్తాంతంబెద్దియైన నుండిన దానినెఱింగింపుము.

ఈశ్వరు:—పార్వతీ! తెలుపుదునా?

పార్వతి:—తెలుపవలెననికదా నిన్ను బ్రశ్నించినది?

ఈశ్వ:—ఓకానొక కాలంబున నీచేఁ బ్రశ్నింపఁబడి నీకు నేనుగళ నాదోద్భవకథ నెఱిఁగింపనా?

అనుబంధము 38.

ఈశ్వ:—సీ॥ ఎందుఁబోయెదవీవు మందేభగామిని
కందర్పబాధలఁగుందనగునె?
పార్వ.—ఇందుశేఖరయటు కందర్పవశుఁడయి
మాదెమేలములాడు చందమగునె?
ఈశ్వ.—అళినీలధమ్మిల్ల! యలరులవిలుతుని
యలరుటంపలబాధ నిలువనగునె?
పార్వ.—అలికానలాంతకుఁడై అలరులములుకుల
యలజడిపడియెటులులుకనగునె?
ఈశ్వ.—గీ॥ పూనుమా కౌఁగిటను నన్నుఁబూఁపుఁబోణి
పార్వ.— మానుమా యిట్టితలఁపులు మాన్యచరిత
ఈశ్వ.— మేనుగూనుదునిన్ను నే మానలేను
పార్వ.— కనుమా, కన్య నన్నిటు కలపవలదు.

ఈశ్వ:—సుధారసపూరిత పరిపక్వబింబఫలాధరా! నీ మనోహర మృదుమధుర వాక్యసారంబుఁ గ్రోలినట్టెల్లను హావభావవయోవిలాసరూపాతిశయములు కనులారఁజూచినట్టెల్లను. నాశరీరంబునఁ గామవికారంబు బలమయి తాలిమిప్రీలి, బాళితాళఁజాలక నీకేళిఁగోరితిని. బాధపడునట్టినన్ను మరుకాకిల మరలఁద్రోయుట యనుచితము గాదు. రమ్ము. ఈరమ్మన్నది. ఇందే నేరమ్ము లేదు.

పార్వతి:—(స్వగ) ఈ మహాపురుషునందెద్దియు మేరమీఱుచుండును. ఇంద్రియనిగ్రహుఁడై నిష్ఠనుండుతఱిఁ జలింపఁజేయుటకష్టము. చలించినపుడు నిలుపుట కష్టము. ఏమిసేయుదు. నాచెలికత్తెలెందు బాఱిరో; జయా(అనియఱచును)

జయ:—అమ్మా! వచ్చితిని. మీతల్లిమేనక దూరమునవచ్చుచున్నది.

పార్వ:—అటులయిన నిచటనిలుచుట తగదు. పోవుదమురమ్మా. (పోవుచుండును.)

ఈశ్వ:—ఓరా కానిశాకరాననా! మరుధాకకు ననువదలి నీవేరీతిఁ బోఁజనదు. నామాట వినక పోయెదవా! మంచిది. పొమ్ము. ఏటుపోయెదవో చూచెద. ఇపుడేమరుని పునర్జీవితునిఁజేసి నిన్నుఁగలంపఁబంపెద. హా. హా. నాకేయింతటిదురవస్థకలుగునని యెన్నక యలనాడు క్రోధమున మారుని మంటలఁగెడపి భస్మంబు సేసితి. వాఁడిపుడుండినచో నెంతటిపనియైనను జేయుచుండెనుగదా! ఇపుడేమాయెను, వానిని మరలబ్రదికించెద.

అనుబంధము 39.

# అనుబంధము.

## అనుబంధము 1.

### కరహరప్రియరాగము - ఆదితాళము.

సూత్ర:—దేవదేవ దేవాదీనాధిభావా
పాలితాభవా ఓమాధవా దేవదేవ
వారిజాసనా దనుజభంజనా
వాసుదేవపద దాసులానుగ్రోవు.

## అనుబంధము 2.

### మధ్యమావతిరాగము - ఆదితాళము.

మాయ:—భూరీ రోగామూసతనే
భూజనులాను గానమే
గిరీశశౌరీ సురేశాదులూ నిరాశనూలూగారే
మారుశరము గేరానేరికై నారాదు గనారధీర.

## అనుబంధము 3.

### శంకరాభరణరాగము - ఆదితాళము.

కళ్యప్రుడు:—నూతన విమలకమలవదనా ॥ పల్ల ॥
సోమునిబింబముబోలెడు మోము కనులకువిందుమించె ॥ అనుప ॥
సరసీజాక్షీ సారసరాగా వారీరాశినిముంచె మీరిన
మారుని బాణాళితినీ సారకును చింతెమదినీ.

## అనుబంధము 4.

### మధ్యమావతిరాగము - ఆదితాళము.

మాయ:—సతీసేవ పాపముగాదా అపారతపాము యతీశా

## అనుబంధము 10.

### నాయకిరాగము - ఆదితాళము.

దధీచి:—ఈమాటలుబలు నీవాడ వేలాయీ రేడులోకమూలేలా గల భవుశివు ॥ ప ॥
బ్రహ్మాత ఖ్యాతిజాతీ నెంచా న్యాయమవు నేమానుమా దక్షవలదురే॥అనుప॥
యీశుని భవనాశుని ఘనునీ దినదినాము సను
దలచర మదీ భువనకర్త భవునిగా మని నీవు
గనుదును ముదముగోరి సదయునీ హృదిగను ॥ ౧ ॥

## అనుబంధము 11.

### ఆభోగిరాగము - ఆదితాళము.

దాక్షాయణి:—ఘనమేమిరా కాలారినిందా మానహీను బోలేమాటడగా ॥ పల్లవి ॥
వినయామునా వేడుదాననిను మానకూనాతండ్రీ నామాటగను ॥ ౧ ॥
భువినెల్లవేలు భూతనేతను బూతూలనాడ బుద్ధిమాంద్యమా
భవనాశునీ పాదపంకజము భక్తిగొల్వనీకు భావ్యముతండ్రీ ॥ ౨ ॥

## అనుబంధము 12.

### కేదారగౌళరాగము - ఆదితాళము.

ఇంద్రుడు:—యెంతకష్టమో మనకూ ఏమికష్టమో
చింతాబ్ధి మున్గినవముబ్రోవగను దిక్కుగనక చిక్కినాము ॥ పల్లవి ॥
అసురవాఘుడు హింసలు నేచూ దాసులరీతిని గాసిలజేయుదు
యిడుములనూ దరిగానక ఘోరకష్టవార్ధిగిలక్షి ఏోగనుమము రొనరు బ్రోవ.

## అనుబంధము 13.

### బిలహరిరాగము - ఆదితాళము.

ఇంద్రుడు:—మారా మధురశరా సురలవనపాల వినిచెదవినుమకనుమ
విరచీ అరచీ వనతలముల యిడుములబడుదు ॥మధురా॥
సకలవిభవమూనూ అసురులకశమరొ నకటకటా కళవళపడుదు
వనిని కలితాబడెదా విసుచుకనిని కలతాబడెద ॥ మా ॥

అ ను బ ం ధ ము 14.

అసావేరిరాగము - ఆటతాళము.

ఇంద్ర:—పోరతిసతిప్రియాలోలా బలుఆనందమాయెనుచాలా
ఘనచింతలెల్లదీరాయె మోదామమీరెగణనీలా
కవిసేక్ ముదముక్ కంటిబహువిధవములక్ నుతసుగుణా
వరకరుణా నతభరణా స్వితచరణా కుసుమ బాణా.

అ ను బ ం ధ ము 15.

ఖాగేశ్రీరాగము - రూపకతాళము.

రతి:—మోహనాంగుడకటరాక నిలిచెనకటా ॥ ఆ ॥ ఆ ॥ ఆ ॥
ఏమిసేయుదోపదాయె మోహనాంగుడకటరాక
మనము దేమొవసతజిక్కె కననుపథము నేను
మనసిజుడేమొమరచెనను మదినిదిగులుఆయె ॥ మో ॥

అ ను బ ం ధ ము 16

శంకరాభరణరాగము - రూపకతాళము.

మన్మ:—చెదరెనుమదినా రమణీ సారసాక్షీననుగన రాకయున్న దేమొ కతమె
కానాత్రిభువనముల రయెనగానానన మేనిచానా రుచిగానా
మనసునాకలత మీరగాను మేరమీరు కారియాలతారు వేళల.

అ ను బ ం ధ ము 17.

తోడి రాగము - ఆదితాళము.

మన్మథ:—చాలుకినుక వలదిక కలికిరో చాలికా చాలికా కనుదయా ॥ ౧ ॥
రతి:—తాపా మేపా నోపా ॥ ౧ ॥
మన్మ:—కోపమును బూననేల చెలియరో మానువు
దయనుబూని గనునను మానినీముదామునా ॥ ౨ ॥
రతి:—దయనుగనైడిదాననే కఠినచేతా వెళ్లుమా ॥ ౨ ॥
మన్మ:—దాసుడాను బ్రోవుమా దయామతీ రతీననూ.

## అనుబంధము 18.

### (గజలు)నవరోజురాగము - ఏకతాళము.

రతి:—మదనాప్రీతినీగనూ మానినీ సేవమాన్యమే ॥ ప ॥
నీకారనూ క్షమియింపుమా పాదమూలబడామదిగన
హితముగు నేర నినుసమ్మ్మానలినీ ॥ మదనా ॥
కోపమునా కనుకీవై పాపమతిగని పదముల
అరచితినేను నినుసమ్మ్మానలిని ॥ మదనా ॥

## అనుబంధము 19.

### హిందూస్థాని జేహాగురాగము - ఆదితాళము:

మన్మ:—అతివా అతిశయచతుర మరినిదే-నిజమని మదిసదానందితీ
మదమొంద వెనుగను మదిరాక్షీ నీమాటలావినా గోరితీ ॥ పల్లవి ॥
రతి:—అడుదాన హెచ్చుగానా మాటలాడగనూ మదీహితమెగను
వందనమురగకె నిజమ్ము దెలుపుము కనుమువచలను
మన్మ:—చంచాలమతీవీవు ఏంచావు కార్యాను
తెలపావు నామాటా నీపిటులా
రతి:—నిరుభాగ్యనూ
మన్మ:—మదికినుకా వలదుయికా తెలిపెదనూ
నిజాము మోదానునా కనుము.

## అనుబంధము 20.

### జేహాగురాగము - ఏకతాళము.

రతి:—చెలినీ వదలిచనగా సముంజసమె మాన్యామె
నీచానానుగాన యనూమానమేలా ॥ పల్ల ॥
పంచశరానీ వంచనమానీ రావామానీ నీకానాయనంగా
ఉన్న చెలీనీ కానాగనీవు రావా యనంగా.

## అనుబంధము 25.

### శంకరాభరణరాగము - ఆదితాళము.

మేనక:—రావే నా చిరునగవులనా బాలా సుగుణాలవాలా ॥ రావే ॥
సోముగోమునుదోము మోముగల నోములపంటవు నుడువులు పాడుచు ॥ రావే ॥
శ్రీనివాసనుతుదీనజనావను మానసమందున మఱవక పాడుచు ॥ రావే ॥

## అనుబంధము 26.

### రాగము - తాళము.

పార్వతి:—కింకరినీనన్ను శంకరమఱవకు అంకమునందిడి బ్రోవరా హర
సంకటములనిశ్శంకాతివారిచి కింకరిబ్రోవరశంకరా హర
మదిధ్యానింతు, నీదగుమానితపదములు మానీనినన్ను మఱవకురా ॥ హర ॥

## అనుబంధము 27.

### శంకరాభరణరాగము - చాప్తాళము.

పార్వతి:—శివశంభో భవరుద్రా భవునిగ నేగోరితినీ
భవనాశా జపమునిరా యువతిని నే గోరితినీ
శంకరక్షేమంకరనీ అంకమునా చేర్చావూ
కింకరినీ నినువదలా జంకేరా శంకరా.

## అనుబంధము 28.

### మధ్యమావతిరాగము - ఆదితాళము.

మేనక:—లాలీశ్రీనగజాతా లాలీగుణచేతా
లాలీభాగ్యోపేతా లాలీశుభచరితా
లాలీశ్రీ హైమవతీ లాలీశ్రీసుగుణవతీ
లాలీశ్రీ పుణ్యవతీ లాలీశ్రీపార్వతీ.

## అనుబంధము 29.

### మాండు రాగము - చాపుతాళము.

పార్వతి, చెలులు:—గొబ్బిళులాడుదమా చెలులా కోరికలుమీరా
డబ్బరలాడకనూ మనము దైవమును నమ్మి
సాంబశివాయనుచు సారసశర్వుని ధ్యానించీ
యంబరకేశుని మామదినీ యనవరతము గౌరి
ఈశానుని గుణ్ణీమదినీ యింతులుగుమిగూడీ
వాసిగను పూజ సల్పి వాసియొందుదుమా

## అనుబంధము 30.

### శంకరాభరణ రాగము - ఏకతాళము.

పర్వతీచెలులు:—

1. నీతిరయుతముగా కనుమూతలాడుదమా
   రీతిగాను సిందుధరుని ఖ్యాతిపాడుచును
2. ఖండపరశుని అఖండచరితాను
   నిండుమానసమున నాడు చూడగోరుదమా
3. కృత్తివాసుని మిత్తిగొంగాను
   చిత్తము త్తి కొలువగోల్వ భద్రమొందమా
4. భూతనాథుని నాతులెల్లరు
   నాతతంబుగానుమదిని నాదుచుందమా.

## అనుబంధము 31.

### బేహాగు రాగము - ఏకతాళము.

పార్వతి:—శివనన్ను బ్రోవుమా వేగాశివ వేగా ॥ పల్ల ॥
మనమునానీపద సేవా నే మరువనెందూ ॥ శివ ॥
శ్రీనివాసుని శంకరినికావా శీఘ్రముగరారా శివ వేగా ॥ శివ ॥

## అనుబంధము 32.

### వసంతరాగము - ఆదితాళము.

మేనక:—కోమలితరమరయా కుసుమాంగికో
మేనునాడగామునమేలకోకనో ఘనదరిగొవదలుమా
చనదిటు తెపము - వదిలుమతినయా
కానాలకంథాగ కర్మామెరయుచుగుమ ॥ కో ॥

## అనుబంధము 33.

### కాపీరాగము - త్రిశ్రగతితాళము.

పార్వతి:—ఈశగిరీశమదీశ సలుపగాచనిరయిదా భవభయహారుధీరా ॥ ప ॥
ధ్యానాతపముల హారియానివరిని సలుపచనైద నేను ॥ ఈ ॥
శివునిభవునిధవునిగాగజేసెద సాహసమురయిజేచని
కూలిమదినిచేర్చి కామితదాతగజేసీ ॥ ఈ ॥

## అనుబంధము 34.

### కాపీరాగము - త్రిశ్రగతితాళము.

పార్వతి:—ఈశగిరీశమదీశ సలుపగాచనిరయిదా భవభయహారుధీరా ॥ ప ॥
ధ్యానాతపముల హారుయానివరుని సలుపచనైద నేను ॥ ఈ ॥
శివునిభవునిధవునిగాగజేసెద సాహసముయిజేచని
కూలిమదినిచేర్చి కామితదాతగజేసీ ॥ ఈ ॥

## అనుబంధము 34.

### జంఝూటిరాగము - ఏకతాళము

పార్వతి:—పాహిసాంబశివా ఈశాభయనాశాభూతాదీశా ॥ ప ॥
పాదుర్నికహ రాయోగచారా

ఆటుగనుమీయంబు జాళి యలరారె సుందరీ హాఅలరారె సుందరీ
చల్ల నీగా లిజెలగునీ కానవిరుగవా చెంత పడిగా చేరుమా సుందరీ ॥జడను॥

అ ను బం ధ ము 38.

బెహాగురాగము - ఏకతాళము

పార్వ:---విడువిడు దేవాదిదేవా అవిగెదానా సలినీసాంబశివా
ఈశ్వ:---మాటలానుకాలము వితాగబోదక్ ఫలితమెఛానాచాల్
పార్వ:---నీతికాదు రీతికాదు వదలు వదలూనక్
ఈశ్వ:---నారిరావటీ నానసూవిడి నే తనుడీవినవే
పార్వ:---నిరంతారాముసగొల్తూకావిడు వడు.

అ ను బం ధ ము 39

ఇంగ్లీషు నోటురాగము - త్రిశ్రగతితాళము:

శ్రీవరా మురా సురా హరా కరుణా భరణా
నిజభక్త భరణ చారుతమణ శోకహరణ ॥ శ్రీ ॥
నీకోమల పదసారస భక్తి దానమునుక్ - నీ
కైవల్యపదసౌఖ్యము ప్రాకటమునుక్
నాకునొసంగముకరుణక్ జొచ్చిలికరునుక్ - నాకే
వినుతా శరిసౌఖ్యకృతా సూవితతా దీనహితా వెదనుతా ॥ శ్రీ ॥

**మంత్రతంత్రములు**:– మంత్రరత్నాకరములు, మళయాళమంత్రములు, సమ్మోహన శాస్త్రము, సకలమంత్రోపాసనక్రమము వగైరా.

**వేదాంతములు**:– సీతారామాంజనేయ సంవాదము, శుష్కవేదాంత తమోభాస్కరము, బ్రహ్మవిద్య, కైవల్యనవనీతము, భగవద్గీత, ముముక్షుజనకల్పము, భంహూసేన్ దాసు తత్వములు, వేమనపద్యములు, శివగీత, సుజ్ఞానరత్నావళి వగైరా.

**ఉపనిషత్తులు**:– కొలది రకములు.

**సంస్కృతకావ్యములు, నాటకములు**:– నీతిశాస్త్రములు, భర్తృహరి సుభాషితము, రఘువంశము ఇంకా ఇతరములు.

**వ్యాకరణము, అలంకారము**:– శబ్దమంజరి వగైరా.

**నిఘంటువులు, అమరము**:- ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రపదపారిజాతము, గురుబాలప్రభోధిక వగైరా.

**ఆంధ్రగ్రంధములు**:– అపూర్వ సంఘసంస్కరణము, భారతము, భాగవతము, రామాయణము, గుప్తభావప్రదీపిక, చాటుపద్య మణిమంజరి, శృంగారకంఠాభరణము, శృంగార రసాలవాలము, శృంగార సావిత్రి వ॥.

**శతకములు**:– కవిచౌడప్ప శతకము, కన్యకాంబతారావళి, కాళగుణాదర్శనము అను శ్రీ తిరుపతి వెంకటేశ్వర శతకము, పెద్దచ్చు శతకములు, టీకా తాత్పర్య శతకములు వగైరా.

**కథలు, వచనములు**:– నిజమైన కాశీమజలీ కథలు, కాశీరామేశ్వర యాత్రాదర్పణము, తెనాలిరామలింగని వింత కథలు, నలుగురు పక్కీర్ల కథలు, మదనకామరాజు కథలు మొదలగు చాలారకములు గలవు.

**నవలలు**:– అనురాగవిపాకము, సుశీలామైనావతి, రాజమండ్రి, బెజవాడ, చెన్నపట్నము వగైరాలు ఎన్నోవందల నవలలు గలవు.

**జీవిత చరిత్రములు**: – ఆసియాఖండ విజ్ఞాన రహస్యములు, దేశనాయకుల చరిత్రలు వగైరా.

**ఆనందమయములు**:– పడకటింటి రహస్యాలు, సతీపతి కుతూహల రహస్యములు వగైరా.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బుర్జుపేట, విశాఖపట్నము.

డ్రామాలు:- బలిజేపల్లి, పానుగంటి, రామనారాయణ, చక్రవధానులు, కోలాచల, చిలకమర్తి, ద్రోణంరాజు, చెన్నపట్నం, కాకినాడ, బెజవాడ, రాజమండ్రి వగైరా ప్రాంతముల ఎన్నో వందల డ్రామాలుకలవు.

కీర్తనలు:- అధ్యాత్మరామాయణము, కబీరుదాసు, భగవన్నామ, రామదాసు, హరిభజన, హరినామ వగైరా కీర్తనలు.

హరికథలు:- అనసూయ, చంద్రహాస, సావిత్రి, పెద్దదాసు, రుక్మాంగద వగైరాలు.

నాటకములు:- ధర్మాంగద, మైరావణ, నంతవేలూరు, ప్రహలాదలు, వీరభద్ర. రామ నాటకములు వగైరాలు.

పదములు:- కుశలాయకం, గంగావివాహము, వైకుంఠమహాత్మ్యం, శారదరామాయణము మొదలగునవి.

జంగంకథలు:- కాంభోజ, కామమ్మ, బొబ్బిలి, బాలనాగమ్మ, కుమ్మరి గుండయ్య వగైరా.

యక్షగానములు:- కపటవేశ్యా నాటకము, రుక్మాంగద, గరుడాచలము వగైరా.

పాటలు:- ఊర్మిళా దేవి. తులసిగోవిందము. పడవపాట, మేలుకొలుపులు. విచిత్ర విడికథ నవాలు. లడ్డూ. పకోడి సంవాదం చెన్నపట్నం. బెజవాడ, రాజమండ్రి. మొదలగునవి.

ద్విపదలు:- బాలభాగవతము. నలచరిత్ర. వగైరాలు.

సంగీతములు:- గాయనగాయనీయ పారిజాతము. సంగీతసర్వార్ధ సారసంగ్రహము. గానవిధ్యావినోదిని. గట్టుపల్లివారివి మొదలగునవి.

వైద్య గ్రంథములు:- బాహటము. చింతామణి. ప్రసిద్ధఆంగ్లేయఔషదయోగములు. వైద్యనిఘంటువులు. శుశ్రుతశారీరస్థానం చెన్నపట్నం, రాజమండ్రి. బెజవాడ తదితర ప్రాంతముల వైద్య గ్రంథములు చాలకలవు.

జ్యోతిషగ్రంథములు:- కాలచక్రం. బృహజ్జాతకం. చెన్నపట్నం. బెజవాడ. రాజమండ్రి. కాకినాడ తదితర ప్రాంతముల వగైరా ఎన్నోకలవు.

అష్టులు, పాకశాస్త్రములు, ఫార్సులు. వర్తక మర్మములు మొదలగునవి.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ. బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79. బొడ్డురామయ్యగారి సందు;
బుర్జుపేట. విశాఖపట్నము.

| | |
|---|---|
| బృహజ్జాతకము 2-0-0 గ్లేజు | 3-0-0 |
| కాలచక్రము 1-0-0 గ్లేజు | 1-8-0 |
| జ్ఞానప్రదీపిక అను మళయాళ ప్రశ్నలు వెల | 5-0-0 |
| తిలకఫల విజ్ఞానమను పుట్టుమచ్చల ఫలము | 0-3-0 |
| కేరళపంచపక్షిప్రశ్న శాస్త్రము | 0-8-0 |
| రసయోగ రత్నాకరము | 2-0-0 |
| సుశ్రుత శారీరస్థానము | 2-8-0 |
| సర్పశాస్త్రము | 0-8-0 |
| షర్బత్ పాక రత్నావళి | 0-6-0 |
| సహదేవ పశుచికిత్స | 0-6-0 |
| వైద్య శతశ్లోకి 0-4-0, | 0-6-0 |
| అనుపాన మంజరి | 0-8-0 |
| నాడీనిదానము తాత్పర్యం | 0-4-0 |
| నాడీజ్ఞానము | 0-4-0 |
| బ్రహ్మవిద్య | 0-2-0 |
| శుష్క వేదాంత తమోభాస్కరము | 3-0-0 |
| సీతారామాంజనేయ సంవాదము సంగ శేషాచలశాస్త్రిగారి ఆంధ్రటీకా తాత్పర్య విశేషార్థ సమన్వితము వెల 3-8-0 గ్లేజు | 6-0-0 |
| కైవల్యనవనీతము | 5-8-0 |
| ధ్యానామృతం | 0-6-0 |
| సమ్మోహనశాస్త్రము అందు అదృష్ట రాజము | 1-8-0 |
| అభ్యాసన చక్రము | 0-4-0 |
| వేదాంత భక్తికీర్తనలు | 0-1-0 |
| యాజుషప్రయోగ చింతామణి | 2-0-0 |
| ప్రేతచూడామణి | 2-0-0 |
| సకల మంత్రోపాసనక్రమము | 0-6-0 |
| దేవీస్తోత్రకదంబము | 0-8-0 |
| శివస్తోత్రామృతం | 0-4-0 |
| కవిచౌడప్ప శతకం | 0-2-0 |
| కల్కిపురాణము 0-12-0, | 1-4-0 |
| తెనాలిరామలింగని కథలు | 0-4-0 |
| రంగదాసు భజన కీర్తనలు | 0-4-0 |
| సుశీల మైనావతి | 0-8-0 |
| మరకతవల్లి | 0-10-0 |
| శమంతసేన | 0-4-0 |
| దొరికితివిరా దొంగ | 0-6-0 |
| నేనే దొంగను | 0-8-0 |
| విషాద వాసంతిక | 0-6-0 |
| వలపుల మడుగు | 0-4-0 |
| శకుంతల జనన నాటకం | 0-8-0 |
| వైకుంఠ మహాత్మ్యం | 0-8-0 |
| ఉషాకళ్యాణం బాణాసురయుద్ధం | 0-12-0 |
| కపటవేశ్యా నాటకం | 0-10-0 |
| మైరావణ నాటకం | 0-8-0 |
| ధర్మాంగద నాటకం (పాలుట్ల) | 0-6-0 |
| ఉషా నాటకం (తిరునగరు) | 0-4-0 |
| వీరభద్ర నాటకం త్వరకవి | 0-10-0 |
| పడకటింటి రహస్యాలు | 1-0-0 |

ఇంకా అనేక రకములు గలవు.



 కాలమానపరిస్థితుల ననుసరించి ధరలు మారుచుండును.

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
[illegible]జు పేట, విశాఖపట్నము.



నవీన ప్రింటర్సు, విశాఖపట్నం. 9-11-51.